# దేశద్రోహి

[ కథల సంపుటి ]

పి. వి. సుబ్బారావు

---

అ ణా లు

# దేశద్రోహి

(కథల సంపుటి)

పి. వి. సుబ్బారావు

ప్రతులకు :

యువ కార్యాలయం

:: తెనాలి ::

రాడికల్ పబ్లికేషన్స్ నెం. 7

జూన్, 1942

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.

## కృతజ్ఞత

ఈ పుస్తకం అచ్చువెయ్యమని ప్రోత్సహించిన మిత్రులు కె. సంగమేశ్వర్రావు, కె. వి. సుబ్బారావులకున్నూ, అచ్చు వేయించవద్దని నిరుత్సాహపరచిన అప్పారావుకున్నూ.

# పీఠిక

"పూర్వ కవులమీద ఏదో విప్లవం తెచ్చామని గర్విస్తారు మీ భావకవులు. నిజమే సంఘస్థితి మారగానే దాని చిహ్నంగా మీ విప్లవం విజయవంతంగా సాగింది. కాని మీమీద కూడా విప్లవం వస్తోందంటే మీరు నమ్మరు," అంటున్నా డీ కథకుడు.

నా అభిప్రాయంలో కథకుడు భావకవులకు లేని ఘనత అంటగట్టుతున్నాడు. భావకవులు తెచ్చినది విప్లవంలాగా కనిపించింది గాని విప్లవంకాదు. నవ్యసాహిత్యంలోనించి భావకవిత్వమనే పలాయన తత్వం విడదీస్తే ఇది పాత కవిత్వమే. ఇందులోనూ కులతత్వమూ, రియాక్షనరీయిజమూ ఉన్నై. ఈ నవ్యకవులమని చెప్పుకునేవారిని ఆమోదించినట్టయితే ఎంత ప్రాచీనాభిరుచులు గల పూర్వ కవికైనా ఇందులో స్థానం వుంది. వీరిని ఆమోదించకపోతే ఎంత నవ్య కవికిన్నీ ఈ నవ్య సాహిత్యంలో స్థానం లేదు.

పోనీ ఆ భావకవిత్వం ఇప్పుడు వెనకబడిందిగదా అనుకుంటే అట్లా సంతోషించటానికి లేదు. ఇది ఈనాడు కవిత్వంలో అంతరించి కథల్లో, వ్యాసాల్లో, ఉపన్యాసాల్లో, ఆఖరుకు ఉత్తరాల్లోకూడా కనిపిస్తున్నది. ఇది ఈనాటి రచయితలందరికీ కాస్తో కూస్తో సంక్రమించి సాహిత్యంలో మచ్చుకైనా యథార్థ సాహిత్యదృష్టి రాకుండా చేస్తున్నది. చివరకు భావకవిత్వంమీద విప్లవంచేసే నెపంతో బయలుదేరిన

సర్రియలిజమున్నా ఒకరకం భావకవిత్వమే. ఇందులో ఉండే 'అహం' భావకవిత్వంలోకంటే ఒక పిసరు జాస్తి.

ఈ పలాయన తత్వంమీద తిరుగుబాటు ఈ పుస్తకంలో కథలు. ఇందులో వాస్తవికదృష్టి ఎక్కడన్నా ఉండదగిన దానికి మించిఉంటే కథకుడు క్షంతవ్యుడు.

ఈ కథకుడు ఒకప్పుడు భావకవిత్వ వ్యామోహంలో పడినవాడు కావటంవల్ల భావకవిత్వతత్వం బాగా ఎరుగును; ఆర్థిక- సాంఘిక తత్వం అవగాహన చేసుకున్నవాడు కావటం వల్ల దాన్ని సరియైన దృష్టిలో చిత్రించగలిగాడు.

ఈ కథల్లో రచనా, శిల్పనైపుణ్యాలు వెతకవద్దు. రససిద్ధికోసం కూడా చూడవద్దు. ఇందులో కథకుడి ఆశయం ప్రధానంగా రసభంగమే.

ఈ కథకుని ఉపజ్ఞ బుల్లికథల్లో చక్కగా కనిపిస్తున్నది.

—కొడవటిగంటి కుటుంబరావు

# ఆత్మ ద్వేష

బల్లమీద పండుకొని గొణుక్కుంటూ వున్నాడు. మధ్యమధ్య ఛూత్కారం చేస్తున్నాడు— ఎవరినో, దేన్నో, నిరసిస్తున్న వాడి మాదిరిగా. కలకత్తా మెయిలు అప్పుడే వచ్చిపోవడం చాత ప్రయాణీకుల అలజడి మాత్రం యింకా కాస్తో కూస్తో వున్నా ననిపిస్తోంది. పండుకుందా మనే ఆశతో ఒక రిద్దరు ప్రయాణీకులు ఆత్రంగావచ్చి బల్లమీద అతను పండుకోవడం చాత నిరుత్సాహంగా దిక్కులుచూస్తూ కాస్త అవతలకు పోయి కింద పండుకొన్నారు. ఒక రిద్దరు పోలీసులు అతన్ని చూచి కూడా చూడనట్టు పోయారు. అతన్ది ఆఫ్ఫారని తెలిసిమాత్రం కాదు లేపకపోవడానికి కారణం. కారణం లేకపోబట్టే లేప లేదు. ఉండి వుండి ఒక్కసారి లేచి కూర్చొని చేతి గడియారం వంక చూచుకున్నాడు అతను. పన్నెండు దాటింది. కుడిచేత్తో నుదుటిని నొక్కుతూ ఆలోచిస్తున్నాడు. వూళ్ళో యిల్లు వుంటే రైలుస్టేషనుకు ఎందుకువచ్చి పండుకున్నాడో మరిచిపోయాడు. జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడు.

"ఎందుకువచ్చినట్టు! భార్యాతో పోట్లాడానా? కాదు. ఆమే నాతో పోట్లాడింది. ఈ భార్యాలు మగవాళ్ళకు వేరు పురుగులు. సంసారమనే పేరు పెట్టుకుని నరకంలో బ్రతకడం నేర్చుకున్నాను యిన్నాళ్లు. వెధవభార్యాలు. ఎప్పుడూ మగ వాళ్ళల్లో తప్పులు పట్టడమే వీళ్ళ పని! అసలు ఎందుకు బ్రతకాలోఅన్నదే తెమలక నేను చస్తూంటే పైగా జలగలాగా పట్టుకు పీల్చుకుతింటోంది. నాకు యిష్టం లేని వుద్యోగా

నికి వెళ్ళకపోవడం నాదే తప్పంటుంది. బ్రతకడమంటే, యిష్టం లేనిపనులు చేసుకొంటూ పోవడమేనా యేమిటి? తనకు సరి పోయినన్ని చీరలు లేకపోవడం నాతప్పేనట! ఆవిడకు అన్నం సహించక పోవడం, రాత్రిళ్లు నిద్ర పట్టకపోవడం నావల్లనట! ఇంకా నయం. వాళ్ళమ్మకు పక్షవాతం రావడం నావల్లనే అనలేదు. నాకు తిండి లేకపోతే మళ్ళీ ఎవరిదీ తప్పుగాదు. నేను పుస్తకాలు కొనుక్కోవడం ఆమెకు తిండి లేకుండాచేసి మాడ్చడానికట. నా పుస్తకాలకూ ఆమె తిండికీ ఎక్కడి సంబంధమో మరి! వెధవభార్యా! అర్థంలేని భార్యా! ఈ వెధవలంతా యిందుకేగామన్ను పెళ్ళిళ్ళకోసం పరుగులెత్తేది!"

అతడు ఇటువంటి ఆలోచనల్లోనే అనంత ప్రపంచంలో అడుగుపెట్టాడు ఇల్లు విడిచి. ఆ పూటకు స్టేషన్ బల్ల దొరికింది. కాని నిద్ర పట్టడం లేదు. ఇంటిదగ్గర పీక్కుతినే భార్యా వున్నా సుఖంగామాత్రం నిద్రపట్టేది. ఇక్కడ పీక్కుతినే వాళ్ళు లేకుండానే నిద్రపట్టడంలేదు. అట్లాంటి కటికబల్ల మీాద ఎన్నడూ పండుకోలేదు.

పక్కకు తిరిగి చూశాడు. ఎవరో ఒకఆవిడ తనవంక ఎగాదిగా చూస్తోంది. ఎంతసేపటినించి తన ప్రక్కన కూచుందో మరి. ఒక్క నిమిషంచూచి, పక్కకు తిప్పుకున్నాడు తల— ఆడమంద! ఎంత భయం లేకుండా పోయింది మగవాళ్ళంటే. ఎప్పుడన్నా అంత దగ్గరగా కూచో గలిగారూ!

"ఏమిటీ, చాలా సేపటి నించీ ఆలోచిస్తున్నారు?" అడిగింది ఆమె.

"నిన్ను గురించి కాదు."

"అది చెప్పకుండానే తెలుస్తోంది. ఈ పూట భోజనం చెయ్యలేదా యేమిటి నిద్రపోలేదు."

"కాదు. భోంచెయ్యబట్టే నిద్ర పట్టడంలేదు. నాకుభోజనం చెయ్యక పోతేనే నిద్ర పడుతుంది. నేను అట్లా వున్న రోజులే యెక్కువ," అన్నాడు.

"ఏవూరు పోతున్నారు?" అదో విధంగా చూచింది ఆమె. అతను అదరిపోయాడు. ఎన్నిసార్లు చూడవద్దన్నా తన భార్యా కూడా అల్లాంటి ఆకలి చూపులే చూసేది. అట్లాంటి చూపులకు ఆహుతి కావడమంటే ఏమిటో అతనికి బాగా తెలుసు. అందుకనే భయపడ్డాడు.

"ఏవూరూ పోను. అనంత ప్రపంచమంతా విహరిస్తాను. ఎందుకు బ్రతకాలో తెలుసుకుంటాను," అన్నాడు.

"మీకు పెళ్లి అయిందా? భార్యా లేదూ?" అడిగింది.

"అయింది. కోర్టుద్వారా కాకపోయినా, నిన్నటితో విడాకులు కూడా జరిగాయి. అయితే ఆమే జరిపింది. ఆమె నీ యంతే వుంటుంది. కాని ఆమె కంటే నువ్వే అందంగా వున్నావు."

"అది మామూలే. భర్తలకు తమ భార్యాలు ఎప్పుడూ బావుండరు. ఇతరుల భార్యాలే బావుంటారు. నేను ఇప్పుడు ఇక్కడ ఎందుకున్నానో తెలుసా! నేను అందంగా లేనని నా భర్త నన్ను కొట్టి వెళ్ళ గొట్టాడు, నెలనాళ్ళ క్రిందట." అతని లోకి బాధగా చూసింది.

"మంచి పని చేశాడు. చెరనుంచి విడిపించాడు. ప్రపంచంలో తిరిగి, ప్రపంచం ఎంత నీచముగుందో తెలుసు

కుంటానికి అవకాశాలు కల్పించాడు. తిరిగి, తెలుసుకో !" అన్నాడు సీరియస్‌గా.

"మీతో మాట్లాడ్డం కష్టం ... నిద్ర పట్టడం లేదు కాదూ ?"— చిన్న నవ్వు నవ్వింది ఆమె.

"అవును. ఇక్కడ నిద్రే పట్టడంలేదు. ఇంటి దగ్గర బాగా నిద్ర పట్టేది గాని నా భార్యా పోరు పడలేక వచ్చాను. మాటి మాటికీ వచ్చి లేపేది లోపల పండుకోమని. నేను చదువుకొంటూ వుంటే కూడా చూచి సహించేది కాదు."

అతని మాటలకు ఆమె, అమాయకత్వాన్ని నటిస్తో కిల కిలా నవ్వింది. అతను మళ్ళీ యింకోసారి చూశాడు ఆమెను. నిజంగా తన భార్య కంటే చాలా అందంగా వుంది. అసలు పోల్చటానికే వీలు లేదు. ఆమెను భర్త వెళ్ళగొట్టాడు; తన్ను భార్య వెళ్ళగొట్టింది; ఇద్దరూ తలవని తలంపుగా కలుసుకున్నారు. ఒక వేళ యీమె తన్ను పెళ్ళి చేసుకోమంటే ! ఈ ఆలోచన అతను భరించలేక పోయాడు: నీచపు పెళ్ళి. పెళ్ళి చేసుకొని చాలా బాధలు పడ్డాడు. చచ్చినా యిక భార్యల జోలికి పోదలచుకోలేదు.

ఆమె ఏమిటో ఆలోచిస్తోంది. శూన్యంగా అతని కళ్ళల్లోకి చూస్తోంది. అతను చాలా యిబ్బందిపడ్డాడు. నిద్ర వొస్తున్నట్టు నటించి బల్లమీదకు వొరిగి, "నాకు నిద్ర వస్తూంది. బల్లమీద నుంచి లేస్తావా?" అన్నాడు.

"ఆఁ లేస్తాను. కాని యిక్కడ చలివేయడం లేదూ ?" అడిగింది ఆమె.

"ఎవరికీ ? నీకా, నాకా ?"

"ఇద్దరికీ"

"నాకు వేసినా ఫరవా లేదు." నిద్ర వొస్తున్నట్టుగా ఆవు లించాడు. లేచి పోమ్మన్నట్టు, ఆమెవంక చూపులు ప్రసరించాడు.

"కోపం వచ్చిందా? మీరు మీ ఆరోగ్యాన్ని మరచి పోతున్నారు. యిక్కడ చలి వేస్తోంది. అదుగో అక్కడ పండుకోవచ్చు, రండి."

ఆమె చూపించిన గది వైపుకు చూచాడు. దీపాలు ఏమీ లేవు. చీకటి కోనేరు. అతనికి ఇక్కడే బావుంది.

"వద్దు. రాను. రోజూ నాభార్యా కూడా నాఆరోగ్యాన్ని గురించి యిట్లాగే జాగ్రత్తపడేది. ఆరోగ్యం నాకక్కర లేదు," అన్నాడు గింజుకుంటూ.

అతను బి. ఏ. పరీక్ష అయినందుకు తిండి సంపాదించుకో లేకపోయినా పుస్తకాలు చదవటం నేర్చుకున్నాడు. అతను పుస్తకాల్లో జీర్ణించుకున్న జీవితాంశాలకీ, తను తన భార్యాతో గడిపిన జీవితానికీ ఎక్కడా పోలికలు లేవు తనకావ్యాల్లోని భార్యాలు తాముపడే బాధలకు, కష్టాలకు, తమ భర్తల్ని ఎక్కడా తిట్టలేదు. తన భార్యా మాత్రం ప్రతి చిల్లర విషయానికీ తన్నే దూషిస్తోంది. తనకు సంతానం లేకపోవడం గూడా అతని దోషమే నట! పాడు జీవితం. భార్యాలతో గడుపుతున్న జీవితాలన్నీ అంతే. అందుకనే అట్లాంటి జీవితానికి విచ్ఛిత్తి కల్పించుకున్నాడు. ప్రపంచమంతా తిరిగి అసలు జీవితమంటేనే ఎంత నీచమయిందో తెలుసుకో దలుచుకున్నాడు. కాని యీ మాయా ప్రపంచం అతన్ని మాయ

కేస్తోంది. మాటి మాటికి స్త్రీలను వుసికొల్పుతోంది.

"ఇంకెందుకు కూర్చున్నావు వెళ్ళక? నా భార్యకూడా యింతే. ఊపిరి పోసుకొనే తీరిక కూడా లేకుండా చేసి వేధిస్తుంది. నువ్వూ భార్యవే గా! ఎక్కడకు పోతుంది మీ భార్య బుద్ధి?" అన్నాడు.

"ఎవరన్నా నవ్వి పోతారు మీ మాటలకు. చలివేస్తుంటటానికి ఏ బుద్ధీ అక్కరలేదు. గుడ్డలు తడిసిపోవడమే గుర్తు. ఒగబా తన చీరె చెంగును ముద్దగా చేసి, విసురుగా అతని చేతిలో పెట్టింది.

అతను మండిపోయాడు. "అయితే? నేను నీభర్తనుకాదు తెలుసా? మహా అధికారాన్ని చలాయిస్తున్నావు."

ఆమె జొటజొట కన్నీరు కార్చింది. జాలిగా అతని వైపు చూచింది.

ఆమె ఎందుకు బాధ పడుతూవుందో తెలుసుకున్నట్టుగా అతను వూపిరి పీల్చి విడిచాడు— "నాకు తెలుసు. నీలాంటి భార్యాభర్తలు లోకంలో చాలామంది వున్నారు. అసలు డబ్బెందుకు గడించాలో అన్నది తేల్చుకోకుండానే డబ్బును గడించడమే పనిగా పెట్టుకుంటారు."

జేబులో చెయ్యిపెట్టి ఐదురూపాయల కాయితం బైటకు తీశాడు. "తీసుకో"— ఆమె వొళ్ళో పెట్టాడు.

ఒక్కసారి కాయితం నలిపి కింద పారేసి రివ్వున లేచింది. రోషంతో కళ్ళు ఎరుపెక్కాయి. అందమైన ఆమెకళ్లు రెండూ రోషంతో జిగాలుమన్నాయి. ఒక్క వుదుటున అగ్గంగా చెయ్యి పట్టుకుని గుంజింది. అతను గింజుకున్నాడు. ప్రయో

జనం లేకపోయింది.

తనభార్యా ఎప్పుడూ అట్లా మాత్రం చెయ్యలేదు. ఆశ్చర్యపోయాడు. కాని ఆలోచించే అవకాశం లేకుండనే బడబడా యీడ్చుకు పోయింది.

*

తెల్లవారి ప్రపంచాన్ని విసర్జించిన వేదాంతి మాదిరిగా తిరుగుతున్నాడు వీధుల వెంట. రాత్రి ఆవిడ మళ్ళా కనపడుతుందేమోనని భయపడ్డాడు.

అతనికి కొద్దిలో గృహజీవనం ఏవిధంగా కనపడిందో బైటి జీవితంగూడా అట్లాగే కనపడుతోంది. ఇంట్లో వున్నప్పుడు కనబడిన మురికి మానవులూ, పీక్కుతినే భార్యలూ, అర్థం లేని తాపత్రయాలూ, బాధలూ అన్నీ బైటకూడా కనబడుతున్నాయి. బైటకూడా వేధిస్తున్నాయి. అతనికి జీవితానుభవాలన్నీ పిచ్చెత్తిస్తాయి. ఇష్టం లేని ఆఫీసులు, ఆడవాళ్ళు, ఆసుపత్రులు, మోసాలు, నీచాలు, అన్నీ అతని బుర్రలో గల్లంతూ, అల్లరీచేశాయి. జీవితమంటే భార్యా అనే జలగ చాత పీల్చి పిప్పిచేయబడి, చివరకు వెళ్ళగొట్టించుకొని, వీధుల వెంట తిరుగుతూ పరాయి స్త్రీ చాత బలాత్కరించ బడడంగా కనిపిస్తోంది అతనికి.

అయోమయంగా వీధుల వెంట పదకొండుగంటలు దాటే వరకూ తిరిగాడు. ఆకలి చాత కడుపు దహించుకు పోతూవుంది. కాని ఎందుకు భోంచెయ్యాలో తేలిందాకా మాత్రం తినదలుచుకోలేదు. ఆ సమస్య వీధుల్లో తిరిగితే తేలేటంత తేలికదిగా కనిపించడంలేదు. వెనక్కు తిరిగాడు.

ఎవరో అడుక్కునేవాడు కేకలు వేస్తూ వస్తున్నాడు కలుసుకోడానికి. గబగబా ముందుకి సాగాడు. కాస్తదూరం పరుగెత్తాడు. ఎదురుగా రాత్రి ఆవిడ వస్తూంటం చూశాడు—అదేమిటో భయం మాత్రం కలగలేదు. పైగా మాట్లాడించాలని బుద్ధి పుట్టింది. నిజంగా జీవించాలీ అంటే, భార్యా అవసరం తప్పనిసరి అయితే, తన భార్యాకంటే యీామె నయం. బుద్ధిగల భార్యాగా కనపడుతోంది.

మాట్లాడించడానికి దగ్గరకు వెళ్లాడు. కాని సిగ్గుతో ఆమె తల వాల్చుకొని పక్కకు దాటిపోయింది. అతను నిరుత్సాహంతో నిలబడి పోయాడు....

"ఒక కానీ యిస్తారూ?" వెనకనించి వినపడింది ఒక కేక.

"ఎందుకివ్వాలి?" వెనక్కి తిరిగి చూస్తూ అన్నాడు.

"ఆకలి వేస్తోంది," అన్నాడు బిచ్చగాడు.

"వేస్తే నాకేం?"

"ఏమీా కాదూ! తోటివాడు చస్తుంటే చూస్తుంటారా?"

"చూడను. కళ్లు మూసుకుంటాను. అసలు నే నా వైపుకి పోతేగా చూస్తానికి. తెలిసిందా?"

వింతవాడుగా కనపడ్డాడు బిచ్చగాడికి.

"ప్రతివాడూ బ్రతకాలా, అక్కర్లేదా?" అడిగాడు.

"ఎందుకు బ్రతకాలో నువ్వే చెప్పు!"

"మీారెందుకు బ్రతుకుతున్నారు?"

"విరక్తి పుట్టినప్పుడు చావడానికి"—బిచ్చగాడికి ఆశ్చర్యం వేసింది. ఇదివరకు ఇట్లాంటి వ్యక్తి ఎక్కడా తటస్థపడలేదు.

"ఏమిటీ! చావడానికి బ్రతుకుతున్నారా?"

"అవును. ప్రతి మానవుడూ బ్రతికేది చావడానికే!"

"ఏమో బాబూ, మీరు వేదాంతుల్లాగా కనిపిస్తున్నారు. బతకటం తప్పితే మీకు ప్రపంచంతో పనుండదను కున్నాను. కాని మీకూ కూడా డబ్బంటే యింత గింజులాటేనా?" వింతగా చూస్తూ అన్నాడు.

బిచ్చగాడి మాటలకు అతనిలోని గాల్స్వర్దీ, హార్డీలు కదుల్లాడారు. అతనిలోని "సినిసిజం" కూకటివేళ్ళతో కదలి వూగులాడింది. నోరు మెదల్పకుండా రూపాయి తీసి చేతిలో పెట్టాడు.

బిచ్చగాడు తెరచిన నోరు ముయ్యాలన్న సంగతే మరచి పోయి చూస్తూన్నాడు. బిచ్చగాణ్ణి వొదిలించు కోవాలన్న ట్టుగా, అసహ్యపు చూపులు చూస్తూ అతను ముందుకు సాగాడు.

ఎదురుగా ఒకవ్యక్తి పరుగెత్తు కొస్తున్నాడు. ఆ వెనక యిద్దరు పోలీసులు లాఠీకర్రలు వూపుకొంటూ వస్తున్నారు, చాలా దూరాన్నించీ. అతనికి ఏమీ తోచక వచ్చే మనిషికి అడ్డు వెళ్ళి పట్టుకున్నాడు. ఆమనిషి ఒళ్ళంతా ముచ్చెమటలతో తడిసివుంది. తెగ రొప్పు తున్నాడు. శరీరమంతా గజగజ వొణికి పోతూంది. పట్టుకున్న చేతిని విడిలించుకో ప్రయత్నిస్తూ, తొట్రుపాటుతో అన్నాడు.

"నన్ను వొదలండి. పుణ్యముంటుంది. పట్టుకోవడానికి వస్తు న్నారు వాళ్లు"—పోలీసుల వంక చూపిస్తూ జాలిగా చూశాడు అతని కళ్ళల్లోకి.

"ఎందుకు పట్టుకుంటారు?" అడిగాడు.

"హత్య చేశానట. ఉరితీస్తానికి !"

"హత్య చేస్తే ఉరి శిక్ష తప్పదా?"

"తప్పదు. ముఖ్యంగా బీదవాళ్ళకు." మరోసారి ప్రయత్నించాడు విడిపించుకోడానికి. పోలీసులు వస్తున్నారు. శాస్త్తాలితే దగ్గరకు వచ్చేటట్టున్నారు. కొత్తవానికి ఆయాసం ఎక్కువవు తూంది.

"అయితే నువ్వు హత్య చేశావా ?"

"చెయ్యాబట్టే పరుగెత్తు తూంది. లేకపోతే నాకెందుకూ యీ అవస్థ? వదలండీ !" ఆతని గొంతుక వొణుకుతోంది.

"హత్యచేసినప్పు డున్న ధైర్యం ఉరితీయించు కొనేటందుకు ఎందుకు లేదు? ఒకటి జరిగితే రెండోది కూడా జరగనియ్యి."

కొత్తవానికి భయం వేసింది. ఇక వదలడను కున్నాడు. జాలిగా చూశాడు.

పోలీసులు దగ్గరికి వస్తున్నారు.

"నాకు భార్యా వుంది. చాలా అందంగా వుంటుంది. గంపెడు పిల్లలున్నారు. నా భార్యా అందాన్నీ, నా పిల్లల్నీ పోషించాలి. నా కింకా బ్రతకాలని వుంది. వదలండీ," అని బ్రతిమాలాడు.

"పో, బ్రతుకు. నీ ఖర్మం."

బాణంలాగా దూసుకుపోయాడు హంతకుడు. అతనేమో పోలీసులకు ఎదురువెళ్ళాడు. వాళ్లు దగ్గర దగ్గరకు వస్తున్నారు. అతను యింకా ముందుకి సాగిపోయాడు. దగ్గరకు వచ్చి నిలవేశాడు పోలీసు.

"వాణ్ణి ఎందుకు పోనిచ్చావు? హత్యచేశాడని తెలీదూ ?"

అడిగాడు పోలీసు..

"తెలుసు. కాని వాడితో మీ కేం పని?"

"ఏం పనా? పట్టుకొని వురి కంబానికి ఎక్కిస్తానికి. తిండి లేని ప్రతివాడూ యిట్లా హత్యలు చేస్తే ఏం గాను దేశం?"

"ఏమవుతుందా? తిండి దొరుకుతుంది. అందరికీ తిండి దొరుకుతుంది. అయినా దేశం జోలి నీ కెందుకూ! నీకు, పోయిన ప్రాణానికి వున్న ప్రాణమేగా కావలసింది," అన్నాడు పోలీసు వంక చూస్తూ.

రెండో పోలీసు పొట్ట పైకీ కిందికీ వూగుతోంది, ఆయాసం కొద్దీ. అప్పటికే పోలీసు లిద్దరూ చాలా అలసిపోయారు. అతని మాటలు అర్థంగానట్టుగా చూస్తూ "యింతకూ మీర నేదేమిటి?" అన్నాడు రెండో పోలీసు. పోయినవాడు ఎలాగూ పోయాడు గనక ఇతని సంగతి తేల్చుకుందా మనుకున్నాడు.

"ఏమీ లేదు. పోయిన ప్రాణానికి నా ప్రాణం చాలుతుందా, లేక యింకా నీలాంటి లావాటివాడి ప్రాణం కావాలా అని అడుగుతున్నా," అన్నాడు అతను.

రెండో పోలీసు అదరిపోయాడు. తనలాంటివాడి ప్రాణం అనడంతోనే తన ప్రాణం నిజంగా పోయినట్టుగా భయపడ్డాడు.

"మీరు చాలు. కాని దానికి కొంచం తతంగం వుంది. అవసరం వొచ్చినప్పుడు మేం చెప్పిన మాటలు అనాలి."

'అదెంత పని' అన్నట్టుగా అతను తలూపాడు. పోలీసు లిద్దరూ రాతి విగ్రహాల్లా నిలబడి పోయారు.

"అయితే మీకు బ్రతకాలని లేదూ?" అడిగాడు పొట్ట పోలీసు.

"చావటంకూడా బ్రతకడంలోదే."

పోలీసుల కది మెట్టవేదాంతంగా కనపడింది. కాని హంత కుడు దొరికే ఆశలు లేవని నిశ్చయించుకున్నారు—అయినా అందుబాటులో మనిషి దొరికినప్పుడు లేనివాడికొరకు ఎవరు అవస్థ పడతారు ?

"అయితే రా !" అన్నారు.

పోలీసుల కంటే ముందు అతనే నడిచాడు హుషారుగా. పోలీసులు చెరి ఒక వైపుకూ వచ్చి అతన్ని పట్టుకు పోతు న్నారు. కాస్త నడిచిం తరువాత మొదటి పోలీసు అన్నాడు.

"అయితే మీా భార్యా... ..." పోలీసు అర్ధోక్తిలో వుండగానే అతను అందుకున్నాడు.

"ఆఁ ఆఁ. భార్యా ఫూసు ఎత్తకు. ఎందుకనోగాని ఇప్పుడు నా భార్యను తలుచుకుంటే బ్రతకాలనిపిస్తోంది మళ్ళీ. భార్యా! ... భార్యా !! ... అవును. నా భార్యా! ... నా అందాల కుప్ప !! ఎంత అందంగా వుంటుం దనుకున్నారు? ఇప్పటికీ నా కళ్ళల్లో మెదులుతూ వుంది.

నేను సుఖపడితే తృప్తిపడేది ! మెత్తటి పరుపువేసి రోజూ నన్ను 'సుఖంగా నిద్రపో, యీా పుస్తకాలూ మన్నూ ఎందుకు?' అని బుజ్జగించేది. నేను పుస్తకాల్లోపడి నా సుఖాన్ని మరచి పోతున్నా ననేది. తాను మంచి చీరెలు కావాలనటం నాకు అందంగా కనపడతానికేనట ! నిజమే ! రోజూ నా కెంతో సుఖాన్నివ్వడానికి ప్రయత్నించేది. అవును. ఆమె చాలా మంచిది. ఎంత అందంగా వుంటుం దనుకున్నారు ? నా జన్మలో చూడలేదు. మీా జన్మలో చూచి ఉండరు.

ఎప్పుడూ నా సుఖం కొరకే పెనుగులాడేది. పాపం, ఆమెతో పోట్లాడి వచ్చాను. విచారంతో నా కొరకు ఎదురు చూస్తూంటుంది. పోవాలి. వొదలండి. తీరికైతే మీరుగూడా రండి, ఒకసారి చూపిస్తాను నా భార్యను— నా అందగత్తెను."

నడిచే నడిచేవాడు నిలబడి రెండు చేతులూ వొదిలించుకో బోయాడు. పెనుగు లాడాడు. కసికొద్దీ కరవబోయాడు.

" నా భార్య......"

లాఠీ మడమలతో రెండు పోట్లు తగిలాయి.

" అసలు హంతకుడివి నువ్వే! " అన్నారు పోలీసులు.

## కథకుడు

భర్త యింటికి వచ్చేటప్పటికి రాజమ్మ, 'పక్కింటి శేషగిరితో చచ్చేరోజు వచ్చిందని' రోజుకుంటూ వచ్చి చెప్పింది. తన్ని చూచి యికిలిస్తున్నాడట. నకిలిస్తున్నాడట. కన్ను కొడుతున్నాడట. యివ్వాళిటికివ్వాళ తడికలో నించి నీళ్లు తనమీద చల్లాడట.

"అలాగా, బాగుంది !" అన్నాడు భర్త—అతడు గొప్ప కథకుడు.

"బాగుం దంటే కాదు. వాడి సంగతి ఏమిటో తేల్చాలి."

"యిలా తీసుకు రా !" అన్నాడు కథకుడు.

"ఏమిటి?" అంది భార్య ఆదుర్దాగా. "వాణ్ణా !"

"కాయితం కలం తీసుకు రా. మంచి కథ అవుతుంది. దీనికి పది రూపాయలు ఘల్లున రాలాలి. చదివిన వాళ్లంతా 'ఆహా' అనాలి," అన్నాడు కథకర్త.

ఆమె తెల్లమొహం వేసింది.

# దేశద్రోహి

"అబ్బ! ఎన్ని వెన్నెల రోజులు కమ్మని రాత్రిళ్లు గడిచి పోయాయి. ప్రేయసీ ప్రియుల ప్రేమ కలాపాలకూ రహస్య సంభాషణలకూ, కోయిల పాటలకూ, మల్లెపూల వాసనలకూ, ప్రణయ పరమార్థాన్ని కల్పించే అవి, నాకుమాత్రం అర్థం లేని వ్యర్థపు రాత్రిళ్లే.

నిజంగా ప్రపంచంలో ఎంతటి అనంత సౌందర్యం వుందీ! ఎంతటి ముగ్ధ ప్రణయతత్వముందీ! అనంత సౌందర్యంలోని ఒక భాగంగానో, దగ్గరగానో వుండే భాగ్యం మాత్రం నేను నోచుకోలేదు. చక్కటి స్త్రీ బజారున పోతూ వుంటే నా దౌర్భాగ్యానికి నొచ్చుకొని, కళ్ళు మిటకరించి, గుటకలు మింగటం కన్నా నేను ఏమిచేయగలుగుతున్నాను? అట్లాంటి అందకత్తెలను, భార్యలుగా, భుక్తంగా వాడుకొనే ఆ 'బ్లెస్సెడ్ ఫూల్సు'ని నిజంగా హత్యచేసినా పాపంలేదు. ఎంత మొరటుగా, మొద్దుగా, వాడుకుంటారు! ఆరాధించ వలసినచోట అధికారాన్ని చలాయిస్తారు, పరమనీచులు! ఆఘ్రాణించి, ఆనందించ వలసిన స్త్రీ దేవతా సౌందర్యాన్ని పట్టుకొని మొరటుగా నలిపి సౌందర్యపు మొలకలను గిల్లి పారేస్తారు మూర్ఖులు!!

సౌందర్యాన్ని ప్రేమించి, పూజించే నాబోటి నిర్భా గ్యుడికి మాత్రం స్త్రీ సౌందర్యం ఎప్పుడూ దూరంగానే వుంటుంది. అది నాఖర్మం. కనీసం స్త్రీదేవత నడిచే దారిగా మారగలిగినా, ఎంత హాయిగా వుండేది. అందుకైనా నోచు

కోలేదు.” కిటికీ ప్రక్కనే మంచంమీద కూచోని, ఒళ్ళో డైరీపెట్టుకొని తెరిచివున్న కిటికీగుండా పేరంటానికీ, దేవాలయాలకూ, వచ్చిపోయే స్త్రీలవంక చూస్తూ కూర్చున్న మహాకవి ఆలోచనలు ఇవి.

సాయంత్రం ఐదుగంట లవుతూంది. ఇదివరకు లెక్కలేకుండా, వ్యర్థంగా, గడిపిన వెన్నెల రాత్రిళ్ళ సంఖ్యకు మరో రాత్రిని కలప బోతున్నాడు... కలప బోతోన్నాడా! రోడ్డువెంట పోతోన్న స్త్రీ మూర్తులను చూచినకొద్దీ అతనికి చెమటలు పోస్తున్నయి. నిరాశాపూరితమైన నిట్టూర్పులతో, చూపులతో, డైరీ తెరిచాడు. అందులో యిలా వుంది—

‘శుక్రవారంనాడు గోపాల్ వాళ్ళ కాలేజీకి తీసుకుపోయాడు. కిరస్తానీల పిల్లట. పేరు సరసీరుహాం ట. వాళ్ళ కాలేజీలో కల్లా “స్టార్” అట. ఐదు నిమిషాల వరకూ యిద్దరం కదలకుండా ఆ అమ్మాయివంక చూశాము.’

ఇంతవరకు చదివి గడ్డంకింద చెయ్యిపెట్టుకొని లోపల్లోపల ఆలోచిస్తున్నాడు కవి. కాలేజీ చదువుకు ఆ అమ్మాయి తన అందాన్ని, ఆరోగ్యాన్ని కొంత బలాన్ని, బలియిచ్చినా యింకా అందంగానే కనపడింది. నిజంగా అదొక వింత అందం. విజ్ఞానంలేని వాళ్ళకు ఆ అందంలో వికాసం కనిపించదు. అట్లాంటి అజ్ఞానులకు ఒకవేళ పొరపాటున సౌందర్యం కనుపించినా, ఆవిడ కిరస్తానీవాళ్ళ పిల్ల అని తెలిసేసరికి కనపట్టం మానేస్తుంది. గోపాల్ నిజంగా అదృష్టవంతుడే! ఎన్నిరోజుల నించి ఆ అనంత సౌందర్యానికి దగ్గరలో కూర్చుంటున్నాడు. ఆ సరసీరుహాం నిజంగా......

అప్రయత్నంగా డైరీ పేజీ తిప్పాడు. ఆపేజీలో యిట్లా వుంది.

'ఆనాడు ఆదివారం. ఎన్నాళ్ళకో కనపడ్డ సుబ్బారావు తనగదికి తీసుకుపోయాడు. "కవీ! కవీ!" అని ఎగతాళిగా చాలాసార్లు సంబోధించాడు. వైదికవాఙ్మయం మీాద ప్రబంధ కవులు విప్లవం తెచ్చారట. ప్రబంధ వాఙ్మయం మీాద మేము-నవకవుల మట—బూర్జువా విప్లవం చేశామట. చారిత్రాత్మకంగా మావిధిని నెరవేర్చుకున్నామట. ఇక మా నేటి కవిత్వంమీాద "ప్రోలిటేరియన్" విప్లవం వస్తోంది ట. ఈవిప్లవ చైతన్యాన్ని ఆంధ్రదేశానికి కలిగిస్తూంది...ఎవరు ... ఊఁ, గోపీచంద్ అట. పైగా సిగ్గులేకుండా "యీా మతం నువ్వు కూడా పుచ్చుకోరాదా?" అని అడిగాడు సుబ్బారావు.

మళ్లీ డైరీనుంచి కిటికీవైపుకు ప్రసరించాయి చూపుల్ని అప్రయత్నంగా. ఒంటరిగా పోతోన్న ఆ అమ్మాయి ఎవరు! ఆవిడ సౌందర్యం ఆకర్షించింది, కవిచూపుల్ని.

"విప్లవమట...ప్రోలిటేరియన్ విపవం. అనంత సౌందర్యాన్ని ఆనందించలేని ప్రతివ్యక్తీ భావజోలికి పోతే ఏం జరుగుతుంది మరి ? ఫ్యాక్టరీకన్నా కనా కష్టం అయింది భావం. సమ్మెలు చేయడానికిన్నీ, విప్లవాలు తీసుకు రావడానికిన్నీ, అసలు కవిత్వం వీళ్ళకొరకు సృష్టించ బడిందని ఎవరుచెప్పారు? అనంత సౌందర్యాన్ని ఆనందించగలవారే, స్త్రీ దేవతా సౌందర్యాన్ని ఆరాధించగలవారే దాని జోలికి పోవాలి... భావంలో......విప్లవమట......ప్రోలిటేరియన్ ...విప్లవం......" నెమ్మదిగా గునిశాడు.

రోడ్డుమీాది అమ్మాయి దాటిపోతున్న కొద్దీ నెమ్మది

నెమ్మదిగా లేచి కిటికీలో మొఖంపెట్టి చూస్తూ నుంచున్నాడు. మరీ మరీ దాటిపోతూంది... తెల్ల మొఖం పడుతూంది కవికి. దాటిపోయింది ఆమె. తిరిగి మంచంమీద కూలబడ్డాడు నిరుత్సాహంగా. తెరిచి వుంచిన డైరీ పేజీ తిప్పాడు—

'మంగళవారంనాడు ఏలూరునుంచి వస్తూ బెజవాడలో దిగి ఆదూరపు చుట్టాలింటికి పోయాను. వాళ్ల సత్కారాలూ మర్యాదలూ, అన్నిటికంటే వాళ్లమ్మాయి శాంత, సౌందర్యం నిజంగా నన్ను తృప్తిపరిచింది.

కిలకిల నవ్వుతూ, జాబిల్లిగా, మెల్లగా, మెత్తగా తిరుగుతూ నాకళ్లల్లో మెరుపు మెరిసి నట్లనిపించింది. విశ్వ సౌందర్య మంతా ఆ అమ్మాయిలోనే వ్యక్తీపడుతూంది. నిజంగా ఆ స్త్రీ దేవతను ఆరాధించబోతోన్న దెవరోగాని అతనే ధన్యాత్ముడు.'

టప్ మన్న శబ్దం. డైరీ మూశాడు కవి.

"శాంత!...ఎంత శాంతంగా వుంది. నిజంగా అనంత సౌందర్యంలోని చల్లదనాన్నంతా నీపేరులోనే దాచుకున్నావు శాంతా. విశ్వ సౌందర్యాన్నే మించిన ఇటువంటి సౌందర్య ప్రతిమను అందుబాటులో పెట్టుకొనికూడా ఆరాధించలేక, వెతుక్కోలేక పోయానంటే, ఎంతటి మూర్ఖుణ్ణి! బెజవాడను మరిచిపోయినా నిన్ను మాత్రం మరువలేను శాంతి దేవతా. కుందనపు విగ్రహాన్ని పరిహసించే నీకు ఎదురుగా కూచోని, నాజీవిత సర్వస్వం అంతమయ్యే వరకూ ఆరాధించ మన్నా జంకుతానా! అసలు అంత భాగ్యం కూడానా, శాంతా! అనంత సౌందర్య మంటేనే నువ్వు. నువ్వంటేనే

అనంత సౌందర్యం. ఈ ఉన్మత్త సౌందర్యోపాసకుడికి ఏనాటి కైనా శాంతిదేవతా విగ్రహాన్ని ఆరాధించే దినాలున్నాయా? ...... శాంతా !!......"

బైట వాయిద్యాల మంగళగీతాలతోనూ, నినాద ప్రతిధ్వనులతోనూ, దేశసేవికల క్రాంతి గీతాల ప్రబోధంతోనూ, తత్ఫలితంగా కలిగిన చైతన్యంతోనూ, బజారంతా కోలాహలంగా కొత్తగా వుంది. ఒక్కసారి బైటకు చూశాడు కవి. పతాకాలు పైకెగరవేస్తూ పోయేవారి కార్యదీక్ష అతనికి ఆటకాయితనంగా కనబడింది. ఆ నినాదాలు రంకెలుగా వినిపించినవి అతనికి. అందుకనే అవి ఏవీ అతన్ని ఆదేశ సేవికలు ధరించిన పట్టుచీరెలూ, మల్లె పూలూ ఆకర్షించి నంతగా ఆకర్షించలేక పోయాయి. అతని హృదయాన్ని దేశసేవికలు ఆకర్షించినంతగా, అంతదేశసేవ సైతం ఆకర్షించలేక పోయింది.

తలుపు తెరచిన చప్పుడయింది.

"ఎవరు! అచ్చి......"

మంచినీళ్ళ కూజా గదిలోపెట్టి పోతోన్న అచ్చి వెనక్కు తిరిగింది. నిదానంగా నిలబడి చూసింది. ఒక్కనిమిషం, అదో రకంగా, మౌనంగా కళ్ళల్లోకి చూశాడు కవి. అచ్చి బిత్తరపోయింది. మొదటినించీ తనముఠికి గుడ్డలూ అవీ చూసి తన్ను ఓ మోస్తరుగా యజమాని అసహ్యించు కొంటున్నాడన్న భావంలో పెరిగివచ్చింది అచ్చి, ఆసంవత్సరంపాటూ. అచ్చి అంటే అల్లాంటి అసహ్యాభావం లేకపోయినా ఏభావమూ లేకుండా మాత్రం పనికత్తెగా చూస్తోవచ్చాడు యజమాని. ఇప్పుడీ చూపులు అచ్చిని అయోమయా వస్థలో ముంచి

లేవనెత్తినె.

"అచ్చీ! మంచినీళ్ళు తెచ్చిపెట్టు." బావిలోనుంచి విన పడ్డాయి మాటలు.

ఆశ్చర్యావస్థలో పడ్డది అచ్చి. తనయజమాని తన కెప్పుడూ అంతటి స్థానాన్ని కల్పించనూలేదు. తాను ఆశించనూ లేదు. మూర్ఛనలుపోయే విపంచీ తంత్రుపులను గురుకు తెచ్చుకుంటున్నాయి, అచ్చి పిచ్చిరక్తనాళాలు. అంతటి స్థానం సంపాయించు కున్నందుకు అచ్చికి ఆనందంలో భయం వేసింది. మౌనంగా కూజాలోని నీళ్ళు గ్లాసునిండా పోసుకు తెచ్చింది. గ్లాసు పట్టుకున్న అచ్చి చేతిమీాద, అతని చేతి వొత్తిడి, మెత్తగా అర్థంగాని హాయిగా తగిలింది; అతనికేకాదు, అచ్చికికూడా—

"అచ్చి! నీలో అనంత సౌందర్యంవుందే."

బైట వాయిద్యాలు అల్లకల్లోలంగా అరుస్తున్నాయి. దేశసేవికల గీతికలు దూర దూరంగా పోతోన్నాయి. స్వాతంత్ర్య సముపార్జనానికి దృఢప్రతిజ్ఞను తీసుకోబోతోన్న వీరులూ, వీరనారీమణులూ, కవిని దాటిపోతున్నారు.

"అచ్చి, నీలో అనంతసౌందర్యం వుందే," అంటున్నాడు కవి.

అతని ఆ అర్థంగాని మాటకు అచ్చి అదరిపడి పోయింది. తనలో ఏదో వుందంటున్నాడు యజమాని. ఆపాదమస్తకమూ ఒక్కసారి చూచుకుంది అయోమయపు అచ్చి. తన బుర్రకు తోచినంతవరకూ ఆ మాసిపోయిన కోకా, చినుగుల రవికా, సత్తు గాజులూ తప్ప కొత్త వస్తువు ఏదీలేదు వంటిమీాద. అట్లాంటి అవకాశాన్ని కల్పించు కుందా మనుకున్నా వీలు

చిక్కనివ్వని బీదరికం నెత్తిమీద తన్నుతూంది. ఆఖరుకి ప్రయత్నపూర్వకంగా మరుగుపరుద్దామని తంటాలు పడుతున్న ఆవిడ ఎడమ వక్షంమీది చిరుగు కూడా కొత్తదికాదే! తనలో తన యజమానికి కనపడిందేదో, తనకు కనపడక పోయి నందుకు కోప్పడింది అచ్చి.

దూర దూర మవుతోన్న దేశసేవికల గొంతుకలూ, నినాదాలూ సహాయపడ్డాయి అచ్చి అసహాయస్థితికి.

"బాబూ! సొరాజ్జంవాళ్ళట వూరేగుతున్నారు. మీరు పోరూ?" అచ్చి నెమ్మదిగా సర్దుకుంది — ఏం చెప్పటానికీ తోచక మాట్లాడిన అచ్చి మాటల్లో వీణాగానం వినిపించింది కవికి.

"అదికాదు నా అచ్చీ. నీ అనంత సౌందర్యంలో నాకు భాగం పెట్టవూ?" నడుం ప్రక్కగా చెయ్యి పోనిచ్చి దగ్గరకు తీసుకున్నాడు అచ్చిని. ప్రతి స్త్రీలోనూ ఒకానొక అవస్థలో పురుషుణ్ణి రెచ్చగొట్టే శక్తివుంటుందని అచ్చికి తెలీదు. వెర్రిపిల్ల. అతనిలోని పశుత్వాన్ని — కాదు ప్రణయాన్ని — ప్రకోపించి, ఎప్పుడో ఒకప్పుడు మూక బాధను రేపే మహిమ తనలో వుందనుకోవటం అచ్చి ఎన్నడూ అనుకోని, వూహించుకోలేని విషయం. అతని చూపులు సైకంగా, అనివార్యంగా, అచ్చి ఎడమవక్షం చిరుగులోనుంచి, తొంగిచూచే యవ్వనంలో చొచ్చుకుపోయాయి. కవిత్వాన్నే తప్ప కోర్కెల్ని విప్పిచెప్ప లేని అతని అధరాలు సైతం ఆశే చూస్తున్నాయి.

ఆ మైకంలో దేశసేవికల గొంతుకలు ఎడారిలోని పిలుపుగా, కలలోని కేకగా, అయిపోయాయి. తలుపు బిగించిన

శబ్దంలో దేశమే అమాంతంగా పడింది. అంతర్ధానమయింది.

దేశద్రోహి విజృంభించాడు......

కవిత్వం వంకతో, పవిత్ర ప్రేమ వంకతో, మానవ శీలం దేశసౌభాగ్యం ఆ దేశద్రోహి చేతుల్లో బలి అయ్యాయి—

## ప్రణయ దేవత!

అతను ఆమెను చూసీ చూడగానే గాఢంగా ప్రేమించాడు. తన శరీరం లోపల, హృదయానికి మధ్యగా, ఆమె రూపాన్ని చిత్రించుకున్నాడు—ఆత్మలో ఐక్యం చేసుకున్నాడు. పిచ్చి ఎత్తినట్లు ఆమె ఇంటి చుట్టూ తిరిగాడు. చాలా తాపత్రయపడ్డాడు.

చివరికి అతని కృషి ఫలించింది. పవిత్ర ప్రేమకు ఎప్పటికయినా ప్రతిఫలం దొరికి తీరుతుంది.

ఒక రోజు ఆమె తన ప్రేమను అంగీకరించి రాత్రికి రమ్మని కబురు చేసింది. అతడు ఎగిరి గంతు వేశాడు.



ఆ రాత్రి ఆమెతో గడిపాడు. స్వర్గసుఖం—ఇంద్రలోకం—మధురమయం. ఆమెను 'నువ్వు నా ప్రణయ దేవతవు' అన్నాడు. 'మనం ప్రేమ దంపతులం కావా' లన్నాడు. 'మన ప్రేమ ఆచంద్రతారార్కంగా నిలిచిపోతుంద'న్నాడు.



తెల్లవారింది. ఆమె ఇంట్లో లేదు. ఎందుకో జేబు చూచుకున్నాడు. పది రూపాయిల నోటు లేదు. మనస్సులో అనుమానం తళుకున మెరిసింది.

ఎవ్వరీమె?

ఆమె పేరు సింహాచలం అనీ, ఆమె ఒక వేశ్యాంగన అనీ అతనికి తరువాత తెలిసింది.

# ఆడవాళ్ల పెట్టెలో....

త్రోందరగా తలుపు తెరిచి అప్పుడే కదిలిన రైలుబండిలో పడ్డాడు అతను. చంకలో వున్న "వైతాళికులు" పక్కన పెట్టి ఒక్కసారి పెట్టెలో వున్న జనం వంక చూశాడు. ఏమిటీ? ఎవ్వరూ లేరూ? అవతల బల్లమీద కూర్చున్న అమ్మాయి మాత్రం ఎవరో దీర్ఘంగా చదువుకుంటోంది. అతనికి గాభరా ఎత్తింది. పొరపాటున ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కానా అని నాలిక కొరుక్కున్నాడు. కిటికీలోనుంచి పెట్టె బైటకు చూశాడు. నిస్సందేహంగా అందులోనే ఎక్కాడు. ఏమి చెయ్యడానికీ తోచక అవతలకు తిరిగి కళ్లు మూశాడు. కాసేపుండి నంగనాచిగా కళ్ళు తెరిచి చూశాడు. ఊహూ. ఆ అమ్మాయి దీర్ఘంగానే చదువు కుంటోంది. పెట్టెలో మరో యువకు డున్నాడన్న సంగతే గమనించి నట్లులేదు. దగ్గాడు. సకిలించాడు. నిట్టూర్చాడు—నిరర్థకం. అతనికి ఒక విధమైన కోపం కలిగింది. బల్లమీదున్న వైతాళికులు తెరిచి చదివాడు.

"హేమపాత్రల చందన మెండిపోయె,
ద్వారములు మోయుచున్నవి హారములను
సానలందింకె స్నాన కషాయగంధ
మబల, ఎవనికోసము సగమై కృశింతు?"

నెమ్మదిగా పుస్తకం పక్కగా, దొంగగా, తొంగి చూశాడు. దీర్ఘంగానే చదువుతోంది ఆపిల్ల. ఈసారి గొంతు హెచ్చించాడు.

"చెక్కు చెదరని పాపట చిక్కువడిమొ,
వేణిబంధము శిథిలమై పిరుదులందె,
కరగిచెరగిన తిలక రేఖలను తుడువ
వతివ, ఎవడా హరించె నీ ... ...

"నిమ్మళంగా చదువుకోలేవూ?"—విసురుగా అవతలి వేపునుంచి వచ్చింది ధ్వని. ఒక్కసారి 'వైతాళికులు' వొణికింది. చివరి మాట తడబడుతూ వచ్చింది.—"ఆ–ర్ద్ర–హృ–ది–ని."

'నిమ్మళంగా చదువుకోలేవూ?' యెంత మెత్తగా అడిగింది! నిజంగా ఏదో కోయిల కూసినట్లుందిగాని మరేమన్నానా? ఎంత ప్రాధేయ పూర్వకంగా వుంది ఆధోరణి. ఒక్కసారి ఆమె వంక చూశాడు. ఆమె దీర్ఘంగా చదువు కుంటోంది. ధోరణి మరీ హెచ్చించాడు.

"పాలు పొంగిన గతి పొంగు ప్రణయరక్తి
ఆపుకొనలేని పడుచు ప్రాయమ్ముతోడ
నమ్మి యెవనికి నీ మనమమ్ముకొంటి
వువిద, ఈ మేఘమాస నవోదయముల?"

ఆవతల పుస్తకంమూసిన ధ్వని. "ఏయ్, ఏమిటది? చెప్పేది వినిపించటం లా? ఏమిటా కుక్క మొరుగుడు?" అన్నది.

"క్షమించాలి. నేను కుక్కను కాను. భావ కవిని."

"అవునవును. నీ మొరుగుడు వింటూనే వున్నా."

"తిరిగి క్షమించాలి. నేను మొరగటంలేదు. భావగీతాలు ఆలాపన చేసుకుంటున్నాను. ఇంకా క్షమిస్తే ప్రేమగీతాలు పాడుకుంటున్నాను."

వస్తోన్న నవ్వును ఆపుకుంది ఆమె.

"అందుకనే అంత కటువుగా మొరుగుతున్నావు. పెట్టెలో యితరులకు గోల అనికూడా తెలీదూ?" ఆమె కోపాన్ని నటిస్తూ అంది.

"మీకు కోపం రాకపోతే అది గోలకాదని మనవి చేసుకుంటున్నాను. హృదయంలో నుంచి పొంగివచ్చే ప్రణయ గీతికలు అవి."

ఆమె మళ్ళీ దీర్ఘంగా చదువుకుంటోంది.

"ఏమిటో చదువుకుంటున్నారు ?"

మౌనం !

"ఏమిటండీ ఆ కావ్యం ?"

తిరిగి మౌనం.

"శివశంకరశాస్త్రిగారి 'హృదయేశ్వ'రా ?" ఒక్క నిమిషం ఆగి, "కృష్ణశాస్త్రిగారి 'ఊర్వశి' లాగా వుందే."

"కాదు, కమ్యూనిస్టు మానిఫెస్టో." చాలా కోపంగా, విసుగ్గా వచ్చింది జవాబు

"ఓహో ! ఆంగ్లకావ్యమా ! ప్రణయ గీతా లేనా ?"

"కవులెవరండీ ?"

"మార్క్సు ఏంగిల్సులు వ్రాశారు."

"ప్రేయసీ ప్రియులను కుంటాను."

"మీది విశాఖపట్టణం అనుకుంటాను."

"కాదు, నానివాసమ్ము తొలుత గంధర్వలోక మధుర సుషమా సుధా గానమంజువాటి! ఏనొక వియోగ గీతికను. ఏం? అట్లా అడిగారు పిచ్చివాడిననా? ఎప్పుడూకూడా కవికీ,

ఉన్మత్తుడికీ ఎక్కువ తేడా లేదన్నారు. నేను కవిని."

"అవునవును, సంయోగమనేది తెలీకుండానే, వియోగాలు పొందుతూండటం మీ భావకవులకు బాగా చాతనవును."

"ఏముందీ, మీరూ నేనూ రైలులో కలుసుకున్నాం. అది సంయోగం మీ స్టేషన్లో మీరు దిగిపోతారు. అప్పుడు నేను పొందే అవస్థ వియోగం అవుతుంది."

"జాతకం బాగుండకపోతే వియోగం విషాదాంతం అవుతూ వుంటుంది."

ఐదు నిమిషాలకాలం ఉద్వరిమధ్యా గడిచింది. ఆమె మళ్ళీ చదువుకుంటోంది. అతను ఆలోచించుకొని, ఆలోచించుకొని జంకుతో, "ఒక్క ఆంగ్లగీతిక చదివి వినిపిస్తారూ?" అన్నాడు.

ఆమె చాలా కోపంగా అంది— "ఇంగ్లలో గీతికలూ వుండవు. జంతికలూ వుండవు." ఉద్రేకపూరితంగా మళ్ళీ అంది. "ఇది ఆ ప్రపంచ క్రాంతి కుమారుల చేత వెలిగించ బడిన ఆరని జ్యోతి. కృషీకసోదరుల జీవన జ్యోతి. ప్రపంచస్థితిని మార్చడానికీ, కూలీ సోదరులు చేసే విప్లవాలకూ, మారూళ్ళు, ఏంగిల్సులు పట్టిన నీరాజనము. అంతేగాని యిందులో చచ్చు ప్రణయ ముండదు."

"పవిత్ర వంత మైన ప్రణయం చచ్చుదా ? మీ కూలీ సోదరుడు నిజమూ ? ......... మీబోటివారి మనస్సులు రోజుకు మూడు అణాలు తెచ్చుకోలేని కూలీవెధవ మీదకు పోవటం విచిత్రంగావుంది."

"నోరు మూయటం మంచిది. సంఘుస్థితి గమనించకుండా

'ప్రేయసీ, ప్రేయసీ' 'ప్రణయమో, ప్రణయమో' అని మత్తెక్కిన కూతలు కూస్తూ కూర్చుండే మీకు ఏం తెలుస్తుంది? కూలీ అంటే మీకు అసహ్యం. కూలీ రాజ్యమంటే అపహాస్యం. మీ మైకం వొదిలితేగాని సత్యం బయటపడదు."

"క్షమించండి, మీది సోషలిజమా? అయితే మీ సోషలిస్టులకు మేమంటే యిష్టమే ననుకుంటా."

"కాదు కాదు- ఎప్పటికీ కాదు. వున్మత్త ప్రేమాలాపనలు పలవరించే మీ రేమిటి మాకు సన్నిహితు లేమిటి? సోషలిస్టుకు కేపిటలిస్టు ఏపాటి బంధువో మీరూ మాకంత. మీ భావకవులు బూర్జువా కవులు. ఈమాట మీ సభాపతే వొప్పుకున్నాడు. మేము కోరేది ప్రజా కవులను. సంఘస్థితిని గమనించి సత్యాన్ని చెప్పేవాళ్ళుగాని, మా కవులు లేనిపోని వర్ణనలూ కల్పనలూ చేసేవాళ్ళు కాదు. మా కవులు 'ప్రేమా' 'ప్రేయసీ' అని యేడ్వరు. కూలీ సోదరులకోసం కూలీ రాజ్యంకై పాటుబడతారు."

"క్షమించండి. మీకు కూలీలంటే అంత ప్రేమ యెందుకు చెప్పండి? ఆ మురికి గుడ్డల వాళ్ళంటేనే నాకు అసహ్యం ముఖ్యంగా."

"అనవసరమైన వాగుడు కట్టిపెడితే బావుంటుంది," అన్నది. మధ్యలో ఆతను తిరిగి అందుకొని "ముఖ్యంగా మీబోటి నాగరికత తెలిసినవాళ్లూ, ఆర్ద్రహృదయం కలవాళ్లూ అందమైనవాళ్లూ, వాళ్లనుచూస్తేనే అసహ్యించుకో వలసిందిగదా!"

"అధిక ప్రసంగం కట్టిపెట్టు." ఎక్కడలేని కోపాన్ని తెచ్చుకుంటూ, మూసిన పుస్తకాన్ని తిరిగి తెరిచి

పేజీలు తిరగవేస్తోంది.

"ఏమో మీకు కోపంగావుంటే నేనేమి అననుగాని, ఆ కూలీలు రాజ్యం ఏలుతారంటే నాకు నమ్మకంలేదు."

"బుద్ధిలేదూ?..." చివాలున లేచింది. అతనివైపుకే వస్తోంది వుగ్రరూపంతో. అతను గడగడ వణికిపోయాడు. అమాంతం లేచిగొలుసు లాగబోయాడు. ఆమె గబగబావచ్చి అతని చెయ్యిపట్టుకొని గుంజింది. అతను బిత్తరిపోయాడు.

ఆమె ఆజ్ఞాపూర్వకంగా "కూర్చో"అంది. అతను కిక్కురు మనకుండా కూర్చున్నాడు. ఆమె మీది మీదికి పోతుంది. అతను వెనక్కి వెనక్కి జరిగాడు.

"పూర్వం కవులమీద ఏదో పెద్ద విప్లవం తెచ్చామని గర్విస్తారు మీ భావకవులు. నిజమే సంఘస్థితి మారగానే దాని చిహ్నంగా మీ విప్లవం విజయవంతంగా సాగింది. కాని మీ మీదకూడా విప్లవం వస్తోందంటే మీరు నమ్మరు. సారస్వత లోకంలో మీ పిచ్చి పిచ్చి ప్రేమలు వుత్త వుత్త ప్రేయసీలు శాశ్వతంగా నిలిచిపోతారనుకుంటారు. సారస్వతం మీకాణాచి అని మీ దుర్భ్రమ—అదే పొరపాటు. మీమీదా విప్లవం వస్తోంది." ఆ చారెడేసి కళ్ళూ, పూసులాడే లోల కుల్లూ, చలించే అధరాలూ, అతన్ని భయపెట్టాయి.

పక్క స్టేషన్‌కు వచ్చి బండి ఆగింది. ఆమె దిగింది. వెనకనే జంకుతో అతనూ దిగబోయాడు. "ఏం దిగుతున్నావ్?" అంది ఆమె. "ఇది ఆడవాళ్ళపెట్టెకాదూ?" అన్నాడు అతను.

"అవును. ఆడవాళ్ళపెట్టే. మీపెట్టే."

అతన్ని లోపలకునెట్టి తలుపువేసింది.

# కడుపు కక్కుర్తి

"ఐస్ ఫ్రూట్, ఐస్ ఫ్రూట్, కానీ. కానీ, ఐస్ ఫ్రూట్"—తన మామూలు బజారుకు వచ్చాడు ఆ కుర్రవాడు; నల్లగా, సన్నగా, పదిహేను ఏళ్లుంటాయి.

అతనా వృత్తిలో ప్రవేశించి దాదాపు సంవత్సరం కావస్తూంది. ఏరోజు కారోజు మూడణాలో, నాలుగణాలో ఒడచుకుంటాడు, ఎండల్ని బట్టి. ఆరోజు ఎండ తీవ్రంగా వుంటే మరో అణా ఎక్కువ సంపాయించాడన్నమాటే! కింద కాళ్లూ, పైన తలా ఎంత ఎక్కువగా మాడితే అంత అదృష్టం వాడికి. కాని ఆరోజున శరీరం ఆపాద మస్తకమూ మాడి మండి పోయిందే గాని వాడి జేబు కానీ మోతన్నా వినలేదు. తను మామూలుగా వెళ్ళే ఆ విద్యార్థి గదికి వెళ్ళాడు.

విద్యార్థి దీర్ఘంగా చదువుకుంటున్నాడు. పాసుకు కింద పెట్టి నెమ్మదిగా గోడకానుకుని కూచుని నిట్టూర్చాడు కుర్రాడు. ఒక్క నిమిషం ఆగి "బాబూ ఐస్ ఫ్రూట్" అన్నాడు. విద్యార్థి పుస్తకంలోనించే చూశాడు కుర్రవాణ్ణి.

"ఏయ్. యికనుంచీ వొద్దు. రాబోకు. మాకు పరీక్షలు జరుగుతున్నయి. తెలిసిందా?" అన్నాడు.

"తెలిసింది బాబూ!"

"ఏమిటి?"

"ఇకనుంచీ ఐస్ ఫ్రూట్ అమ్ముకుంటే పొట్ట గడవదని."

"సరే యిక వెళ్లు. చదువుకోవాలి."

"బాబూ మీరు యికనుంచీ రావద్దన్నారు, ఇవాళ్టికు

మాత్రం కొనండి." దీనంగా చూశాడు కుర్రాడు. విద్యార్థికి జాలివేసింది.

జేబులోనుంచి కానీ తీసి వాడివైపుకు విసిరాడు.

"ఊఁ. ఒక టిచ్చిపో."

"బాబూ కానీతో పొట్ట నిండుతుందా? పైగా యీ కానీలో సగం పైన ఐస్‌ఫ్రూట్ ఆయనకు పోవాలి. ఏమన్నా గానీ యివన్నీ యివ్వాళ మీరే కొనాలి."

"కొని, ఏం చెయ్యమంటావ్? బజార్ల వెంట తిరిగి అమ్ముకోమంటావా? పో, వెధవా. మీ అక్కయ్య వుందని చెప్పావుగా యిదివర్లో. అదేం సంపాదించదూ?"—అంతకు ముందు కలిగిన ఆకాస్త కనికరము తుడుచుకుపోయింది. పైగా విద్యార్థికి వాడిమీద కోపం వచ్చింది. వెధవ! పరీక్షల్లో చదువు మింగెయ్యడానికి దాపరించాడు.

"అక్కయ్యా! బాబూ దానిసంగతే చెపుతారూ. అదెందుకూ పనికిరాదండీ. దాని కోసమే నాకీ అవస్థ. అది లేకపోతే నేను హాయిగా చెయ్యి ఆడిస్తూ బ్రతికేవాణ్ణి. దానికి దొంగతన మంటేనే గిట్టదు." కుర్రాడు గుడ్లు తేలవేస్తున్నాడు.

విద్యార్థికి వాడు ఏ మూడు రోజులనాడో అన్నం తిన్న వాడిమాదిరిగా కనబడ్డాడు. అంతలో మళ్లీ విద్యార్థికి జాలి వేసింది వాడిమీద. వెధవకుంక, తెలివిగలవాడే. దొంగతనంచేసి బ్రతికేవాడట హాయిగా. అవును. పాపం వాడేం జేస్తాడు, కడుపు మాడుతోంటే! తను చదువుకున్న సోషలిస్టు సిద్ధాంతాలన్నిటినీ ఆ కుర్రాడి కేసుకు "అప్లయి" చేసి చూస్తోన్నాడు విద్యార్థి. వాడి అక్కయ్య సోమరిపోతులాగా

కూచుని వీడి శ్రమ మీద జీవిస్తోంది కాబోలు. వెధవ అక్క-య్యలు! వెధవ చుట్టాలు!

"రోజూ మీ అక్కయ్య ఏంచేస్తుంటుందిరా?" కళ్లు మూసుకు కూచున్న కుర్రాడు, విద్యార్థి ప్రశ్నకు కళ్లు తెరిచి చూశాడు.

"ఏంచేస్తుంది? ఆ శంకరయ్యరుగాడితో సరసా లాడు తుంటుంది."

"ఏ శంకరయ్యరు?"

"వాడే నండీ. మా అక్కయ్యను ఉంచుకొన్న శంకర య్యరు. ఆ సుబ్రమణ్యంఅయ్యరు కాఫీ హోటల్లో యిడ్లెన్లు ఇస్తాడే వాడు. నేను యీ ఐస్ ఫ్రూట్ అమ్మటం మొదలు పెట్టిన రోజుల్లోనే, వాడూ మా యింటికి రావడం మొదలు పెట్టింది. వాడంటే మాఅక్కయ్యకు ఎంత ప్రాణ మనుకున్నారు? వాడు మా యింటికి వచ్చినప్పుడల్లా మా అక్కయ్య దాన్ని అది మరిచిపోయేది. కందిరీగలాగా ఎప్పుడూ వాడిచుట్టూ తిరిగేది. అయితే వాడూ మా అక్కయ్య అంటే అట్లాగే వుండేవాడు, లెండి. వాళ్ళ కాఫీహోటలు పెట్టిన సుబ్రమణ్యం అయ్యరు పెళ్ళాంకంటే కూడా మా అక్కయ్యే బాగుంటుందనేవాడు."

మధ్యలో అందుకున్నాడు విద్యార్థి; అతను యిట్లాంటి కథలంటే ఒక్క చెవే కాదు గొంతు కూడా కోసుకుంటాడు. పదిమందికి చెపుతాడు. పదిమంది చాత చెప్పించు కుంటాడు.

"ఆఁ! అయితే ఏం జరిగింది?"

"ఏం జరుగుతుంది? కొంత కాలానికి మా అక్కయ్య నెల

తప్పించు కుంది. ఆ తరవాత వాడేదో మందు తెచ్చి యిచ్చాడు మా అక్కయ్యకు. దాంతో ఆ కడుపు దారిని అది పోయింది. వాడు మా యింటికి వచ్చే మొదటి రోజుల్లో ఏదో కాస్త యిచ్చే వాడండీ. అయితే వాడుమాత్రం ఏం చేస్తాడు లెండి? వాడికి వచ్చే యిరవై రూపాయల్లో పది రూపాయలు అరవ దేశంలో వున్న వాడి ముసలి తల్లికీ, వెధవ చెల్లెలికీ, దాని కూతురుకీ పంపుతాడు. ఇక మిగిలిన రూపాయలతో పెళ్ళి చేసుకోవాలన్నా, పెళ్ళాన్ని పోషించాలన్నా కష్టమే చూడండి.

అందువల్లనే మా అక్కయ్యతో స్నేహం చేశాడు. అట్లాంటి బీదరికంలో ఎవరైనా ఇంకేం చేస్తారు చెప్పండి? కాని ఆ వెధవ మొదటి రోజుల్లో తప్పితే మళ్ళీ దమ్మిడీ యిచ్చిన పాపాన పోలేదు. వెధవ అరవ బుద్ధి. రోజూ తేరగా వచ్చేవాడు మా యింటికి. పైగా వాడికి, నేను తెచ్చిన డబ్బులో కాస్త మిగిల్చి యిచ్చేది మా అక్కయ్య. నేను వూరుకోలేక ఒక రోజు మా అక్కయ్యతో పోట్లాడాను. ఆ సమయానికే వాడు వస్తే మా అక్కయ్య వాణ్ణి కాస్తడబ్బుకు ఒత్తిడి చేసింది. ఆ పర్ని, వాడు విదిలించుకు పోయి మూడు నాలుగు రోజులు రాకుండా బిగదీసుకు పోయాడు." ఇక చెప్పడానికి ఓపిక లేదన్నట్టుగా ఆపాడు కుర్రాడు. ఆకలికి వాడికళ్ళు తిరిగి పోతోన్నాయి. అలమర వైపుకు చూశాడు. అందులో ఉన్న అరటిపళ్ళు చూడగానే వాడికి నోరూరింది.

"బాబూ! అరటికాయలు భలేగా ఉంటయి." విద్యార్థి నవ్వు ఆపుకోలేక పోయాడు.

"సరేలే. శంకరయ్యారు సంగతేమిటి"

"ఏముందండీ. ఆ నాలుగు రోజులూ మా అక్కయ్య వాడి కొరకు నన్ను ఏడిపించి ఎర్రమన్ను చేసింది. నా మీద కాసేపు అలిగింది. దాన్ని అది తిట్టుకుంది. మళ్ళా నన్ను బతిమాలింది. వాణ్ణి తీసుకు రమ్మంది. నేను మాత్రం చచ్చినా పోనన్నాను. చివరికి ఐదో నాడు వాడే వచ్చాడు.

వాడు యింట్లోకి రాగానే మా అక్కయ్య బావురమని ఏడ్చింది., ఇక ఎప్పుడూ వాడికి కష్టం కలిగించనని బతిమాలుకుంది. వాడు నిప్పుల్లో దూకమంటే దూకుతానంది. నీళ్ళలో దిగమంటే దిగుతానంది. ఏదన్నా చేస్తానంది. ఆ వెధవ బిర్ర బిగదీసుకున్నాడు. నాకు మొదటనుంచీ వాడంటే మంట. దానికి తోడు వాడు మా అక్కయ్యను అట్లా ఏడిపిస్తుంటే నేను సహించ లేక పోయాను. మా యింట్లోనించి బైటకు పొమ్మన్నాను వాణ్ణి. వెధవ! ఇక వాడా కోపం పట్టలేక గబగబా మా అక్కయ్యను రెండు దెబ్బలు వేశాడు. అనరాని మాటలు అన్నాడు. 'వీణ్ణి అలవాటు పడ్డావు, వాణ్ణి అలవాటు పడ్డావు' అన్నాడు. అనాలని అన్నాడు గాని మా అక్కయ్య నిజాయితీ వాడికే తెలుసు. ఆ పర్ని నేను కర్ర తీసుకొని మీదకు వెళ్ళితే పిరికి వెధవ లాగా పారిపోయాడు. మూడు రోజులయింది ఇది జరిగి. ఇక వాడొచ్చే ఆశలు వొదులుకుంది, మా అక్కయ్య. కాని మూడు రోజులనించీ ఉపవాసాలే చేస్తోందండీ - దాంతో పాటు నేనూ. నిజంగా దాన్ని అది చంపు కొనేట్టుంది. ఏం చెయ్యాలో తోచడం లేదు. ఏదో గుండె రాయి చేసుకొని యివ్వాళ ఐస్ ఫ్రూట్ అమ్మ

కోడానికి వస్తే ఒక్కటీ అమ్ముడు పోలేదు. మా కర్మ ఏం చేస్తాం! మళ్ళా రేపు కూడా వస్తుండవలసిందే!"—జాలిగా విద్యార్థికళ్ళల్లోకి చూసి మళ్ళా అంటున్నాడు –

"ఇక లాభం లేదండీ. మా అక్కయ్యను ఎట్లాగోట్లా బలవంతపెట్టి వొప్పించి మరో మారాజును కుదుర్చుకోక తప్పదు."

విద్యార్థి జేబులోనించి రూపాయి తీసి విసిరాడు వాడిమీదికి. వాడు సంతోషాన్ని పట్టలేక, ఇదివరకటి ఆకలినంతా మరిచిపోయి ఎక్కడలేని సత్తువతో, హుషారుతో లేచి టేబుల్ మీది కాయితం కిందపరిచి గబగబా ఐస్‌ఫ్రూట్లు తీసిపెడుతున్నాడు. విద్యార్థికి వాడి హుషారుచూస్తే నవ్వువచ్చింది. వాడి చాత అవన్నీ మళ్ళా ఫ్లాస్కులో పెట్టించాడు.

"పో అవన్నీ ఎవరికన్నా అమ్ముకో. నువ్వా రూపాయి యింటికి తీసుకుపో. ఎప్పుడన్నా డబ్బు అవసరపడితే నా దగ్గరకు రా. తెలిసిందా?" అన్నాడు విద్యార్థి. వాడేమీ మాట్లాడ లేదు. కూచున్న చోట్లోనించి కదల్లేదు. ఏదో మాట్లాడ బోతాడు. గొంతు పెగలక వూరుకుంటాడు. విషాదాంత నాటకంలోని నాయకుడి స్నేహితుడు లాగా సుఖానికీ దుఃఖానికీ మధ్యవుండే స్థితిలో, అవ్యక్త మధుర వేదనవంటి ఒక అనిర్వచనీయమైన బాధలో తనకూ ఆ విద్యార్థికీ వున్న ఏ పూర్వజన్మ బాంధవ్యాలనో లోలోపల కదిలించుకుంటూ వున్నాడు కుర్రాడు. అవును మరి. ఈ ప్రపంచంలో మానవుడు కోరుకున్న కోరికను మనం తీర్చినా, అనుకున్న ప్రకారం మాట చెల్లించుకోడానికి గొంతు పట్టుకున్నట్టుగా

ముక్కుతారు. ఎన్నన్నా చేస్తారు. కాని అసలు ఒడంబడిక నెర వేర్చరు. తప్పించుకు పోయేవాళ్ళు కొందరూ. తన్నిపోయే వాళ్ళు కొందరూ. తియ్యని కబుర్లు చెప్పే వాళ్లు మరికొం దరూ. కడుపు మాడుతూందంటే, బాధ్యత లేకపోయినా అవస రాలను తీర్చే ఈ విద్యార్థి వంటివాళ్ళు ఎంతమంది దొరుకు తారు? శంకరయ్యరు లాంటి వెధవలు ఎంతమంది సరి పోతారు ఒక్క ఈ విద్యార్థికి. మోసంతో, వుచితంగా తమ అవసరాలను తీర్చుకుపోయే శంకరయ్యరు వంటి వెధవలు ఎంత మంది లేరు? కటువుగా మాట్లాడినా ఎంత మార్దవం వుంది ఇతనిలో!

ఐస్ ఫ్రూట్ కుర్రాడు ఇంకా కదల్లేదు - ఏదో ఆలో చిస్తూన్నాడు.

"బాబూ మరి......" అర్ధోక్తిలో ఆగాడు కుర్రాడు.

వాడి వంక విపరీతంగా చూశాడు విద్యార్థి. ఏమిటి వాడు ఇందాకటినుంచీ ఆలోచించేది? దేన్ని గురించి బాధపడు తున్నాడు? అసలు పడుతూంది, బాధా సుఖమా?

"ఊ! ఏమిటి 'మరి'......" అడిగాడు విద్యార్థి.

"మరి మా అక్కయ్యను ఇక్కడికి తీసుకురమ్మంటారా, మీరు వస్తారా?" అడిగాడు కుర్రాడు. విద్యార్థి వాడివంక కోపంగా, కాదు జాలిగా, కాదు రెండూగా చూశాడు. ఒక నిమిషం ఎవరూ మాట్లాడలేదు.

"బాబూ! వాడిమీద మా అక్కయ్యకు ఎంత ప్రేమ వున్నా, మిమ్మల్ని చూస్తే ఇష్టపడుతుం దనుకుంటాను. ఇష్ట పడకపోతే ఇంట్లోనుంచి వెళ్ళగొడతానని బెదరిస్తాను. తన్ని

వొప్పిస్తాను. మీకు అనుమానం అక్కర్లేదు. కాని పొద్దు గూకిం తరువాత ఎవరూ చూడకుండా, నేనొచ్చి తీసుకెడతాను మిమ్మల్ని. కాదంటే మా అక్కయ్యనే తీసుకొస్తాను. మీ ఇష్టం చెప్పండి."

"సరే రేపు తీసుకురా. ఆలోచిద్దాం."

విద్యార్థి మాటలకు కుర్రాడు ఎక్కడలేని వుత్సాహమూ చూపించాడు. 'రేపు తీసుకురా ఆలోచిద్దాం' అన్నాడు. తన అక్కయ్య అందం చూస్తే కాదనడం చాతనవుతుందా ఇతనికి. ఇతనికే గాదు. ఎంత నిగ్రహాశక్తి వున్న బుద్ధదేవుడైనా తన అక్కయ్య అందాన్ని చూస్తే చలించితీరుతాడు. ఇక యీ విద్యార్థి లెఖ్ఖా!

అయితే రేపటినుంచీ ఈ విద్యార్థి తనకు కొత్త బావే-కొత్త చుట్టం కాబోతున్నాడన్నమాట. భౌతిక అవసరాలకు బాధపడ్డ అతని పసి హృదయం ఈ రానున్న ఐశ్వర్యానికి ఎగిరి గంతులేసింది. ఏది నీతో, ఏది నీతి బాహ్యమో అని మీమాంస చేసుకొనే శక్తి నశించిం దతని మనస్సుకు. దైనందిన అవసరాలకు నలిగి, ఆహుతి అయ్యే అట్లాంటివాళ్ల మనస్సులు ఎప్పటికీగూడా నీతి అవినీతుల గట్లనూ, హద్దుల్నీ గుర్తించవు. అందుకనే ఆతన్ని బావగా కోరాడు. ఆలోచిస్తానంటే ఎగిరి గంతేశాడు.

కుర్రాడు మెట్లుదిగి పోయాడు హుషారుగా. విద్యార్థి వాణ్ణి చూస్తూ నిలబడ్డాడు.

విద్యార్థిలోని సనాతనుడు గుండెలు బాదుకున్నాడు. వాడి అక్కయ్య రేపు వస్తుంది. ఆమెతో ఏం చెయ్యాలి ? ఎవరి

కివ్వాలి ? వాళ్ళ కడుపుమంటలు తీర్చాలా ? వొద్దా ? వూరికినే తీర్చాలా ? తీర్చినందుకు ప్రతిఫలం అపేక్షించ వచ్చా ? ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకక అట్లాగే నిలబడిపోయి దిక్కులు చూశాడు విద్యార్థి.

## అబద్ధాలు

"అతను సాయంత్రం వస్తాడు. అత నంటే నీ కెంతో ప్రేమ అని చెప్పాను. అతని కవిత్వ మంటే నువ్వు పడి చస్తావని చెప్పాను. నువ్వు అత నికి అట్లాగే కనపడాలి!"—ప్రాధేయపూర్వకంగా అడిగాడు భర్త తన భార్యని.

అతని భార్య చాలా అందగత్తె. ఆమెను చూచి ముగ్ధులు కాకుండా ఎవ్వరూ పోలేరు.

కాని అతను మాత్రం సంసార తాపత్రయంలోపడి భార్య అందాన్ని ఒక్క నిమిషం కూడా తీరిగ్గా చూచి ఎరగడు యింతవరకు.

అతని ప్రశ్నకు, "వీల్లేదు. నాయిష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తాను," అంది భార్య.

ఆ సాయంత్రం అనుకున్న ప్రకారం వచ్చాడు అతని స్నేహితుడు. అతన్ని వెంటనే తన గదిలోకి తీసుకుపోయాడు భర్త— "నా భార్య మీ రంటే మీ కవిత్వ మంటే పడి చస్తుంది. అందుకనే మీ రంటే యిష్టం వున్నట్టు కనపడకుండా నటిస్తుంది. మరిచి పోకండి," అన్నాడు.

లోపలకు పోయి భార్యను కలుసుకున్నాడు—

"నువ్వు తప్పకుండా అతని మీద యిష్టం వున్నట్టు ప్రవర్తించాలి. నువ్వంటే అతనికి చాలా యిష్టం. అందుకని అయిష్టంగా ప్రవర్తిస్తా వేమో జాగ్రత్త," అన్నాడు.

"నా యిష్టం!" అంది భార్య.

"చూస్తాగా ?"—బెదిరించాడు భర్త.

మర్నాడు ఉదయం వూరంతా పాక్కిపోయింది. అతని భార్య అతని స్నేహితుడితో లేచి పోయిం దట! పోషించే బాధ్యత తప్పిందని చెమటలు తుడుచుకొని నిట్టూర్చాడు భర్త.

# అనూరాధ

రైలు దిగి స్టేషన్‌లోపలకు వచ్చాం. తనకొరకెవరో వచ్చి అవతలెక్కడో వున్నట్టుగా నలుదిక్కులూ చూచింది అనూరాధ. ఎవళ్లూ రాలేదు. తాను వస్తున్నా, స్టేషనుకు మనిషినన్నా పంపించాలని గుర్తులో లేని భర్తదగ్గరకు అనూరాధ నన్ను తీసుకెళుతోంది.

తన భర్త చాలా మంచివాడట. తన్నెంతగానో ప్రేమగా చూస్తాడుట. నాకంటే కూడా అందంగా వుంటాట్ట. ఎవ్వరూ లేని ఇంటరుక్లాసులో కూచోని ఏమేమిటో చెప్పింది పిచ్చి అనూరాధ. తన కొరకు ఆయన కారువేసుకొని స్టేషనుకు వచ్చి కూర్చుంటాడని చెప్పింది.

జట్కాబండివాణ్ణి పిలిచి బాడుగ మాట్లాడుతూంటే బిక్కమొగం వేసుకుని నా ప్రక్కనే నిలబడింది. ఆ ముఖలక్షణాలు ఎప్పుడూ నాకు గుర్తుగానే వుంటాయి. ఎంత గాయపడిందో పిచ్చి అనూరాధ, ఆ భర్త చేసిన అవమానానికి. ఎంతమంది మానవతులు ఎంతమంది అభిజాత్యంగల గృహిణులు యిట్లా యీ భర్తలనే పవిత్రవంతమైన దేవుళ్ల కాళ్లక్రిందపడి వారి కోపాలకూ, తాపాలకూ, మానవత్వం లేని మొరటుతనానికీ, నిరంకుశత్వానికీపాలై — వెన్నెలరాత్రి కోసమై కళ్ళు తెరుచుకుని కాచుకూర్చునే చకోరపక్షుల్లాగా వారి అనుగ్రహం కోసమై, ఒక్క మంచి మాటకై, జీవితాల పర్యంతమూ వేచివుంటంలేదు ? ఎంతమంది అర్థాంగులు ప్రతిఫలం యివ్వని పతులకు శరీరాలతోపాటు ఆత్మలని

కూడా ఆహుతిచేసి, వేశ్యలకంటే నీచంగా బ్రతుకుతూ, పతివ్రత లనిపించుకుంటానికి తంటాలు పట్టంలేదు. ఈ పతివ్రతలు పవిటపిన్ను కావాలన్నా, సబ్బుముక్క కావా లన్నా, యీ కనికరంలేని భర్తలకు శరీరాలను మాటి మాటికీ అమ్మవలసిన అవస్థలకు పాలవటం ఎంతమందికీ తెలియని విషయం! నీతిమీాదా, మతంమీాదా, పాతివ్రత్యం మీాదా, ఉపన్యాసాలు దంచే యీా కొంగ భర్తలు, వాళ్ల వాళ్ల భార్యలతో వ్యభిచరించడం కాక మరేం చేస్తున్నారు?

అనూరాధ అంతగా చెప్పిన ఆ భర్త యింట్లోనే లేడు. ఎక్కడకు పోయాడో! ఎన్నాళ్లకో తల్లిదండ్రుల్ని చూచిన చిన్నపిల్లలాగా, జైలునుంచి విడుదలైన ఖైదీ ప్రపంచాన్ని తిలకించే ఆతురతతో, అనూరాధ ఒక్కసారిగా, పదిసార్లుగా, యిల్లంతా చూచుకుంది.

"మన ప్రయాణం చాలా బావుంది కాదూ?" పడకగదిలో మేను వాలుస్తూ అంది.

"అవును, ఇద్దరమే ఇంటరుక్లాసులో ప్రయాణం—హాయి గాక!"

"మనకు తోడు రాజారావుకూడా వుంటే యింకా బావుం డేది."

రాజారావంటే అనూరాధను పెండ్లాడిన డాక్టరు. అత నంటే ఆమెకెంతో గాఢానురాగమని నా కప్పుడప్పుడే తెలుస్తూ వచ్చింది. అతనుంటే యింకా యెక్కువ యేమి బాగుండేదో నాకు తెలీలేదు. నా అనూరాధకు నేను పనికి రాని యేచోట—యేసమయంలో, అతను పనికివచ్చాడు?

ఆ యింటరుక్లాసులో కూర్చొని, తెంపులేకుండా తను చెప్పిన సంగతులన్నీ వసిష్ఠ భగవానుని ఉపదేశాలు విన్న రాముని కంటే యెక్కువభక్తి శ్రద్ధలతో విన్నానే; నిద్రవచ్చేకథ యేదైనా చదివి వినిపించమంటే ప్రేమ కథ చదివి రెండు నిముషాల్లో నిద్రపుచ్చానే:—నేను తనకుకావల్సింది ఏది యివ్వలేను కనక రాజారావు కావాలనిపించింది అనూరాధకు!

నిజంగా యీ మానవజాతికి కృతజ్ఞత అనేదే తెలీదు. ఒక్కొక్క మనిషికొరకు ఎంత త్యాగంచేసినా, ఎంత బాధ పడ్డా, ఒకో ఆరాధ్యదైవాన్ని పూజించినా, పాదసేవచేసినా, మరో జీవియందు తనకున్న ప్రేమసర్వస్వాన్నీ వెల్లడించి, అవసరమైనప్పుడు నీ సుఖంకోసం నా జీవితాన్ని త్యాగం చేస్తానని చెప్పినా, గౌరవం లేదు సరిగదా, గొంగళి పురుగును విదిలించినట్లు విసిరి పారెయ్యడమో, అమాయకుడి కింద లెక్క కట్టడమో జరుగుతోంది. నిజానికి కృతజ్ఞత యెరగని చచ్చుజాతి యీ మానవజాతి వొకటే!

నా అనూరాధ కూడా వీళ్లల్లో జమేనా ? నా పిచ్చితల్లి సుఖపడుతోంటే నేను యెప్పుడు చూడకుండా వున్నాను. తనకొరకు నా జీవితాన్నైనా త్యాగంచేస్తానని తెలీదు గనకనా, ఎందుకు యీ నిర్లక్ష్యం మరి ? ప్రపంచమంతా 'స్వార్థం' 'స్వార్థం' అని సమ్మెటమోతలు మోగుతున్నా, ప్రపంచంకొరకు జీవితాల్ని భగ్నంచేసుకునే నాబోటి దద్దమ్మలు, అందుకనే పనికిరాకపోతారు.

అనూరాధ లేచి వెడుతోంది.

"ఎక్కడికి ? ఎక్కడికి ?"

"ఇక్కడికే, ఇప్పుడే వస్తా."

"నేనూ వస్తాగా..." వెంటబడ్డాను.

"ఛీ నువ్వు రాకూడదు."

"రావొచ్చు."

"రాకూడదోయ్, పిచ్చి నాయనా." మురిపెంగా చేతి వ్రేళ్లన్నీ ముడిచి కొనవ్రేలు చూపించి తుర్రున పారిపోయింది.

నాకు చాలా సిగ్గేసింది. ఏపని చేసినా నాతో చెప్పిగాని చెయ్యని యీ పిచ్చిపిల్ల, నేనంటే నిర్లక్ష్యంగా వుంటుందా? కొందరు మానవులు ఎంత త్యాగంచేసినా తొణకరు. కన బడరు. నాబోటి వేడిరక్తం వాళ్ళు దబ్బున బైటపడతారు. నా అనూరాధకు నాకూ అదే భేదం. కొందరు త్యాగంచేసినా ఫలానా మనిషికి, ఫలానా సమయంలో త్యాగం చేశాననో, చెయ్యబోతూవున్నాననో డప్పుకొట్టి గాని చెయ్యరు. ఆ త్యాగ మైనా ఆ ఫలానా మనిషి తనకు పనికివస్తాడు, తన ఋణం ఎప్పుడైనా తీర్చుకుంటాడు, అని నమ్మక ముంటేనేగాని చెయ్యరు. యిది మూడో తెగ. ప్రపంచంలో బ్రతక నేర్చిన వాళ్లూ, బ్రతకదలచుకున్న వాళ్లూ, విధిగా యీ తెగకే చెందాలి.

ప్రతిఫలాపేక్ష లేని త్యాగంచేసిన బయటపడే నాబోటి అమాయకులకూ, కనపడని త్యాగంచేసే నా అనూరాధ తెగకూ పనికివచ్చే ప్రపంచం కాదిది. బాజాభజంత్రీలు. "త్యాగం" "త్యాగం" అంటూ బాకాలూదుతూ తిరిగి తేగానీ, ఫలానా మనిషికోసం త్యాగం చెయ్యబోతూన్నానని 'నెల నోటీసు' యిస్తేనే గానీ, త్యాగం అనేది ప్రపంచంలో వుందనీ

త్యాగంయొక్క స్వరూపం ఇదని తెలుసుకోలేరు యీ మానవులు. అసలు అట్లాంటి బాకా వూదుడుకే గౌరవమూ, కీర్తీ, ప్రజ్ఞా అన్నీని. కనపడని త్యాగాన్ని గుర్తించి, గౌరవించగల, ద్రవించగల, సునిశిత, సున్నితహృదయం ఏదీ యీ ప్రపంచంలో ?

ఆ కనపడని త్యాగం జరిగే మహత్తర సమయంలో, యుగయుగాలకు ఒక్కటిగా దివ్యకాంతులతో వెలిగే ఆ సంభవానికి, జీవన జ్యోతులు వెలిగించి పురిటిలోని పిల్లలను సైతం బ్రహ్మానందంతో మైమరపించే ఆక్షణాలలో, హృదయాలు తెరిచి మానవ జీవితాదర్శాన్ని అర్థంచేసుకొనే అవకాశాన్ని మానవులకు కల్పించే అట్లాంటి నిమిషాన, మానవజాతి మైమరచి మత్తుగా నిద్రపోతూంటుంది. ఈ కుంభకర్ణుని సంతతి ఎప్పుడో కొంతకాలానికి మత్తు నుంచి లేచి తన పూర్వజన్మ సుకృతమనీ, దేవుని దయ అనీ, చెప్పుకుంటూ, ఆ మహత్తరమైన కనపడని త్యాగ ఫలితాన్ని జుర్రుతుంది. ఎన్ని పవిత్ర హృదయాలు కనపడని త్యాగాలకు ఆహుతి అయిపోతే తాము నిరపాయంగా బతగ్గలుగుతున్నామో అన్న సంగతి హృదయాలు లేని యీ మానవ యంత్రాలకు ఏం తెలుస్తుంది? అదంతా వీటిని నడిపించే (యీ యంత్రాల దృష్టిలో) దేవుని మహిమే అనుకుంటాయి. వీటికి బాధంటే అవగాహన కాదు. అసలు హృదయాలు లేనిచోట్ల బాధ ఎట్లా వుంటుంది, వెర్రి భ్రమకాక !

తిరిగివచ్చి మంచంమీద నాకు దగ్గఱగా కూర్చుంది అనూరాధ. మళ్ళీ ప్రారంభించింది ఆ రాజారావు సోది. అత

నెవరో ప్రయాణీకుడు ఐదారు స్టేషన్ల వరకూ మా ఏకాంతాన్ని ఆటంకపరిచాడు గాని, దారిపొడుగూతా, జట్కాబండిలో కూచున్నప్పుడు సైతం, రాజారావుగోలే చెపుతూ వచ్చినా అనూరాధకు యింకా తెగలా. ఇంత అతిగా చెప్పబడేవాడు ఆ స్త్రీ మనిష్ని—భార్యా వస్తుందని తెలిసే ఆ సమయానికి పత్తాలేకుండా పోయాడు! ఈ స్త్రీలు పుట్టిందగ్గరనుంచీ మగవాళ్ళని—ముఖ్యంగా భర్తల్ని—పొగుడుతూ, పూజిస్తూ, వాళ్ళకులేని ప్రతాపాన్ని కొండంతలుగా చెప్పుకుంటూ, తమ్ము తిట్టుకుంటూ అబలలమని చెప్పుకుంటూ వుబలాట పడటం చేతనే మొగాళ్లు రాచి రంపాన బెట్టడం నేర్చుకున్నారు వీళ్ళని.

నిజంగా ఆత్మవిశ్వాసమూ, గౌరవమూ లేనప్పుడు స్త్రీ అయితేనేం, పురుషుడైతేనేం, ఎందుకు గౌరవించబడాలి? ఆత్మగౌరవం లేని స్త్రీని ఏవిధంగా, ఎంతగా, వాడుకున్నా దోషం లేదేమో! ఈ భార్యాలే గనక నిజంగా తమ భర్తల జీవితచరిత్రలు రాయటం మొదలెడితే వంటవాడు మొదలుకొని ప్రతి మగాడి చరిత్రా ఓ సీజరు చరిత్రగానో, శివుడి చరిత్రగానో తయారు కాదూ! అనూరాధవంటి భార్యాలు, ఇష్టంలేని నాబోటి వాళ్ళను బలవంతాన కూచోబెట్టి, రాజారావుల సాహసకృత్యాలు వినిపించేకంటే జీవితచరిత్ర రాసినా బాధ తప్పుతుంది. అనూరాధ బాధను సహించలేని నాకు అనూరాధ యేమన్నా నొచ్చుకుపోతుందేమో, అన్న భయం కలిగి విన్నాగాని, ఆ రాజారావు చరిత్ర ఏమిటో వింటూనే మరచిపోయా—అతను అనూరాధ భర్త అన్న విషయాన్ని

మించినవన్నీ! అనూరాధనే కాదు. అట్లాంటి అందచందాలూ, హృదయమూవున్న మరి ఏ స్త్రీ బాధపడుతూన్నా నాకు అశాంతిగా, బాధగా వుంటుంది. నా బాధకు సానుభూతి చూపే ఒక్క కన్నీటిబొట్టు అయినా యీ అనూరాధల హృదయాల్లో వుందేమో తెలుసుకోవా లనే నా అభిలాష, ఆంతర్యమూ.

నిజంగా ఏదో డాంబికానికి, కిష్టయ్య కోప్పడలా దేమో నని జడిసి, భావకవుల్ని తిట్టడమే గాని నేనుమాత్రం ఆజాతి వాణ్ణి కానూ? నావిమాత్రం ఆ రుచులు కావూ?

"చూడు, రాజారావుకి యిక్కడ డాక్టర్లలో మంచిపేరు."

"ఊహు!"

"ఎంతపెద్ద ఆపరేషన్ అయినా నిర్భయంగా చేస్తాడు."

"ఊఁ"

"ఇంతవరకు ఒక్క ఆపరేషన్ కేసయినా చెడిపోలేదు."

"అవును, డాక్టర్లు ఆపరేషన్ చేసినంత బాగా మరో ప్లీడరో, కవో, చెయ్యలేడు. అప్పుడప్పుడూ యీ డాక్టర్లు అనవసరంగా—అలవాట్లై కాబోలు—తమ భార్యాల హృదయాలను కూడా ఆపరేషన్ చేస్తుంటారు."

"రాజారావు నన్నెప్పుడూ ఆపరేషన్ చెయ్యలేదే!"

"కనపడేట్లు చేస్తే వాళ్ళ తెలివితేటలేమున్నాయి! కనపడకుండా మత్తుమందుపెట్టి చేస్తారు. అందులో భార్యలను మరీ తెలితేటలతో చేస్తూంటారు."

"ఆపరేషన్లు అనవసరంగా చేస్తారనా నీ వుద్దేశం?"

"కాదు కాదు. అవసరం కలిగే! వాళ్ళకు హృదయాలుండవు గనక హృదయాలున్న భార్యాలను చూచి సహించ

లేక అగపడని ఆపరేషన్లు చేస్తూంటాడు."

"నువ్వు చెప్పేదేమిటో అర్థం కాలేదోయ్. 'రాజారావు కఠినుడనా? ఛీ! ఛీ! చాలా మెత్తని హృదయం అతన్ది."

"రాజారావు మంచివాడే నేమో, నేనంటుంది డాక్టర్లని."

"అవును మరి రాజారావూ డాక్టరేగా?"

"నేను కాదన్నానా?"

"నీకు రాజారావంటే కోపమా? నువ్వు అతన్ని చూడలేదు. చాలా మంచివాడు." జాలిగా ఏదో నాచాత ఒప్పించాలన్నట్టుగా మొఖంలోకి చూచి అంది.

"ఎందుకోయ్ నీకీ శ్రమ? నీవు చెప్పక్కర్లేకుండానే రైలు దిగిం దగ్గరనుంచీ, రాజారావు నాకు అర్థమవుతూనే వున్నాడు."

"స్టేషనుకు రాలేదనా? ఏదో వూరికిపోయి వుంటాడు."

"అవునవును. యీ డాక్టర్లకు 'పేషంట్లు' కిచ్చే బిల్లు తాపత్రయంలో భార్యలే గుర్తుకు రారు."

ఇద్దరి మధ్యా ఐదునిమిషాలు గడిచాయి. ఆకాసేపూ రాజారావుని నేను అననిమాటలు యేవైనా వూహించుకొని నామీద కోపాన్ని నటిస్తూందో, లేక యీ భర్తల నిరంకుశత్వంలో నలిగిపోతూన్న ఆమెలోని సతీత్వాన్ని ఎదిరించి మానవత్వం తిరుగుబాటుచేస్తే దిగ్భ్రమ చెందుతోందోగాని, వంచినతల వంచినట్లే వుంచింది.

ఈ స్త్రీజాతి నిజంగా తనకావలసిన వాళ్లెవరో, అక్కర లేనివాళ్ళెవరో కూడా నిర్ణయించుకోలేదు. తమలోవున్న మానవత్వాన్ని మేలుకొలిపే నిజమైన వైతాళికుల్నే ఈ

జాతి కరవొస్తుంది. దగ్గరకురానివ్వదు.

"బెజవాడ స్టేషన్‌లో కలుసుకొని చాలాసేపు మాట్లాడే ఆతనెవరనుకున్నా?" అడిగింది అనూరాధ.

"ఏదో ఒక వేటకుక్క అనుకున్నా."

"కాదోయ్ పిచ్చిముండా. అతనూ ఒక చిన్న డాక్టరు. రాజారావు స్నేహితుడు."

"పోనీలే ఏదో మందుల కుక్క."

"నీకు డాక్టర్లంటే ఎందుకోయ్ అంతకోపం!"

"నాకెందుకూ కోపం. వాళ్ళకు బిల్లులమీద ఉన్నంత ఆదరణ స్త్రీలమీద ఉండదు. వాళ్లు పేషంట్ల జేబుల్ని ప్రేమించినదాంట్లో వెయ్యోవంతు ప్రేమించరు భార్యలను. బెజవాడ స్టేషన్లో కనబడ్డ డాక్టరులాంటివాళ్లు, ఎప్పుడైనా తీరిక చిక్కితే, స్త్రీలమీద ఎగబడతారు. అట్లాంటప్పుడు ముప్ఫయి లంకణాలరోగి కోరికల్ని మించిన కోరికలు పరుగెత్తుతూంటయి—రాత్రిపూట గదిలో ఒంటరిగా వున్నప్పటి కాలేజీవిద్యార్థి కోరికలకంటే తీవ్రంగా, బాధగా, ఉద్రేకంగా వుంటాయి, యీ డాక్టర్ల కోరికలు. యీ డాక్టర్లనీ, మిలిటరీ వాళ్ళనీ, ఆంబోతెద్దుల్నీ సృష్టించిన దేవుడు మరొకడు, కొత్త దేవుడు. స్త్రీలను, పూలను, చంద్రుణ్ణి, నిన్ను, నన్ను సృష్టించిన దేవుడు అదే చేతుల్తో ఆరకం జాతుల్ని సృష్టించలేదు. రోగి డబ్బు గుంజుకున్నట్టుగానే యీపుష్పాన్ని—శక్తివుంటే అన్నిపుష్పాల్నీ—పట్టుకొని నలిపి, మొద్దుగా వాడుకుంటారు..."

"ఏమిటోయ్! యివ్వాళ కొత్తగా మాట్లాడుతున్నావు!

ఏమి జరిగింది? డాక్టర్లు నువ్వనుకున్నంత రాక్షసులు కారోయ్. ఇంకా కావలిస్తే రాజారావుని చూస్తావుగా. సాయంత్రానికి వస్తాడు."

'కాసేపు పండుకో' నవ్వుతూ అనూరాధ లేచిపోయి ప్రక్క గది తలుపు వేసుకుంది.

నేను నిద్రపోయినంత సేపూ నిద్రపోయిందో ఏంచేసిందో, సాయంత్రం నాలుగు గంటలకు మాత్రం టీ పట్టుకొని గది లోపలకు వచ్చింది.

అనూరాధను చూడగానే యిందాక అనవసరంగా డాక్టర్లను అట్లా ఎందుకన్నానా అనిపించింది. అవన్నీ రాజారావుని అన్నాననుకుందో ఏమో! అనవసరంగా బాధ పెట్టినట్లవుతుంది.

ఆ రాజారావంటే నాకంత ఈర్ష్యాసూయ లెందుకుండాలి? నిజంగా అతనెంత మంచివాడో! చూడనన్నా చూడలేను.

టీ పట్టుకొచ్చిన ఆ సాయంకాలపు నా అనూరాధను చూస్తే, ఆ రాజారావుని యేమన్నా అంటే ఆమెను బాధ పెట్టినట్లవుతుందేమో అని భయపడ్డా. స్త్రీల కొరకు ప్రాణాలను ధారపోసే మగవాళ్ళను లోకం ఎగతాళి చేస్తుంది గాని, నిజంగా ఆ సాయంత్రపు నా అనూరాధకు నా ప్రాణాలేకాదు, లోకాన్నంతటినీ బలివ్వమన్నా వెనుదీస్తానా, ప్రేమ వీరుడిలాగా పోరాడుతాను గాని.

టీ త్రాగి కప్పు టేబుల్ మీద పెడుతూవుంటే, "బజారుకు పోయిరావూ? కాస్త పనుంది," అంది అనూరాధ. బజారు వెళ్ళి నేను తిరిగి వచ్చేసరికి ప్రొద్దుగూకుతూంది. అనూరాధ చెప్పిన

ప్రకారం రావలసిన రాజారావు యింకా రాలేదు. ఇంట్లో అనూరాధ కనుపించలేదు. పడకగదిలో మాత్రం మల్లెపూల వాసన ఘుమాయించి కొడుతోంది. కాని అనూరాధ మాత్రం లేదు. నాకు పిచ్చెత్తినట్లయింది. యిల్లంతా వెదికాను. వాకిట్లో చూశాను.

సందు చూశాను—ఇక మిగిలింది స్నానాల గది ఒక్కటే. బజారునుంచి తెచ్చిన ఆ సరుకులతోనే, వుండదనుకుంటూనే, గబగబా స్నానాల గదిలోకి పోయాను.

"ఛీ! ఛీ!! పిచ్చిపిల్లాడా, సిగ్గులేదూ ?"

ఒక్కసారి, స్నానంచేస్తోన్న అనూరాధమీద ప్రసరించాయి చూపులు. సిగ్గుతో, భయంతో, బజారునుంచి తెచ్చిన సరకులు అమాంతం పడేసి, బైటబడ్డాను.

ఆ సాయంత్రం వరకూ నా ప్రక్కన నన్ను ఆనుకొని కూర్చున్న నా అనూరాధ, నాకు కొత్తగా తోచింది. వింతగా కనపడింది. ఏమిటో ఆకారంలేని భావాలూ—స్వరూపంలేని సౌందర్యమూ, ఎందుకో తెలియని మూగబాధా, అసంతృప్తి, కళ్ళముందు ప్రత్యక్షంగా నాట్యమాడాయి. అనూరాధను చూట్టమంటే భయమేసింది. కాని చూడకుండా వుండాలన్న బుద్ధీ పుట్టలేదు. అనుకున్నా జరిగేది కాదేమో! అనూరాధకళ్ళల్లో కళ్ళుపెట్టి ఎన్నిసార్లు చూడలేదు ? కాని ఆ నిమిషాన, నా చూపులు నాకే వింతగా, వెగటుగా, నైకంగా తోచాయి. నాజీవితంలో ఎప్పుడూ నేను అట్లా నా అనూరాధ వంకే కాదు— ఎవ్వరివంకా చూచి ఎరుగను.

కాని ఒకానొకప్పుడు అట్లాంటి చూపులే నామీద

పడ్డట్టు నాకు బాగా గుర్తు. విశ్వ సౌందర్యమంటే ఎరగని చిన్ననాటి నా స్కూలు ఫైనల్ రోజుల్లో, మీ అబ్బాయి నా పక్కలో పండుకుంటాడులే అని మావాళ్ళకు చెప్పి ఆరాత్రి తన పక్కలో పండుకోబెట్టుకున్న ప్రక్కింటావిడ నా వంక అట్లాంటిచూపులే చూచింది. కాని లెక్కలు మాస్టరు బెత్తం దెబ్బలకు బండబారిన నా పసి హృదయానికి అవి అర్థం లేకుండా పోయాయి. నిజంగా అనూరాధను గురించి నేను పొందిన వింత భావాలు, అనుభవాలు, అనూరాధ గూడా పొందిందో లేదో నాకు తెలీదు.

అతను రాలేదు. ఆరాత్రికి వస్తాడనే ఆశలు నిరాశలు చేసుకుంది. తన మంచాన్ని నా మంచానికి దగ్గరగా లాక్కొని పండుకుంది అనూరాధ. ఏమేమిటో చాలా సేపు మాట్లాడింది. కాని నాకు మాత్రం సరీగ్గా సమాధానం చెప్ప బుద్ధి పుట్టలా. అనూరాధ నిద్రపోతున్నా లేపి కబుర్లు చెప్పే నాకు, నా స్వభావం ఆరాత్రి ఎంత తన్నుకులాడినా అంతుపట్టలా. పక్కమీదనుంచి లేచిపోయి బజార్ల వెంట తిరుగుదామని పించింది.

లేవబోతోంటే "శశీ, బైట చలివేస్తుంటే ఎక్కడికి లేచిపోతావు? పండుకో," అన్నది అనూరాధ.

ఎంతసేపు గింజుకున్నా నిద్ర మాత్రం పట్టలా. అనూరాధ ఆజ్ఞా పూర్వకమైన బుజ్జగింపు మాటలు నా వీనుల్లో రింగురింగున తిరుగుతున్నాయి. ఆమె తల్లోని మల్లెపూలు మాట్లాడుతున్నాయి నిద్ర తెచ్చి పెట్టుకుందామనుకుంటున్న నాతో.

అన్నిటి కంటే డాక్టరుమీద అసూయాభావం విజృంభించింది. చిన్నప్పటి నుంచీ నా అనూరాధకు ప్రాణప్రదంగా వున్న నాకంటే మధ్య వచ్చిన యితను అంతటి ఆత్మీయుడు ఏ విధంగా అయ్యాడు? అత నిచ్చిన సుఖాన్ని దేన్ని నా అనూరాధకు, నేను యివ్వలేను!

ఇరువురు స్త్రీ పురుషులు, భార్యా భర్తలుగా నెరవేర్చుకొనే విధ్యుక్త ధర్మానికి, చిరకాల స్నేహాన్ని, హృదయంలో మంటుతున్న కోరెక్కల్ని, ఆశల్ని కోసి, యితరుల మీద వుండే అనివార్య ప్రేమను తుడిచివేసి, చులకన జేసే మహత్తు నిజంగా వుందా, లేక దానికి యీ మానవులు కల్పించుకొంటున్న భ్రమా? క్రిమి కీటకాదులు మొదలుకొని సకల జీవ రాసుల్లోనూ, సామాన్యంగా, నిత్యంగా, జరిగే ఆ బూతుపనే నా, మానవుల మధ్య బాంధవ్యాలను కల్పించి, ఆత్మలను ఒకటిగా చేసే మహత్తర బంధం? అదే కాక పోతే ఆ రాజారావు అనూరాధకు నాకంటే ఏవిధంగా దగ్గరి వాడయ్యాడు? ఒకప్పుడు నా అనూరాధకు ప్రాణప్రదమైన నేను, యిప్పుడు, ఏవిధంగా, ఎందుకు, అంతగా దూర దూరమై పోతున్నాను? ఆమెకు నన్ను ప్రాణప్రదంగా చేసిన నాలోని ఏ భావము జీవం లేకుండా పోయింది, యీనాడు? నా సహచర్యాన్ని ఒక్క నిమిషం కూడా పోగొట్టుకోలేనని చెప్పిన అనూరాధేనా యీ కళ్ళు మూసుకొని, రాని నిద్రను తెచ్చుకుంటూవున్న అనూరాధ. నా లో లే ని ఏ magic spell ఆ రాజారావుకు వశ్యం చేసింది నా అనూరాధను?

బుర్రపట్టని ఆలోచనలు వస్తున్నాయే గాని బుర్ర మాత్రం పగిలి పోవటం లేదు. ఎంతసేపు, యీ ఎడతెగని, తెలియరాని, ఆలోచనలు నన్ను వశం చేసుకున్నాయో, తెలియ బోని విషయం. అనూరాధకూడా అటూ యిటూ మెసలుతూనే వుంది, నిద్రపోయినట్లు లేదు. ఆమెను కూడా, నన్ను మాదిరిగానే, ఏ ఎడతెగని భావాలు, ఏ మాటలు రాని మూగ బాధ వశం చేసుకుంది?

మునిసిపాలిటీ గంట పన్నెండు సార్లు మోగింది. కిటికీలో నుంచి దొంగగా, తొంగి చూస్తున్నాడు చంద్రుడు. అనూ రాధ కప్పుకున్న ఉన్ని శాలువాను చీల్చి యిచ్చే చల్ల దనంతో పాటు మెత్తటి కోర్కెల్ని రేపే, వెన్నెలను సైతం లెక్క చెయ్యని అనూరాధ, తలవని తలంపుగా కలిగిన శరీరస్పర్శకు ఒక్కసారిగా తుళ్ళిపడింది నిద్రనుంచి మేలొ్క న్నట్లు. ముసుగుతీసి, మత్తుగా, నెమ్మదిగా, కళ్లు తెరచింది. ప్రేమచేత పెట్టి పోషించబడ్డ ఆ కళ్ళల్లో, రెప్పల్లో, తీరని కోర్కెలు తాండవమాడాయి. ఆనంద సౌధాల్లో నివసింప జేసే ఆశాజ్యోతులు వెలగాయి. పూరేకుల్లాంటి అనూరాధ కనురెప్పలమీద పెట్టుకున్న ఆ మెత్తటి ముద్దుకు, మూసిన కళ్ళు అల్లాగే మూసుకుపోయాయి ప్రేమచేతనో, బాధ, వల్లనో. నాకళ్ళు మాత్రం తీవ్రంగా, తీక్షణంగా కోరలు సాచాయి. బాధతో భయంవల్లా అనూరాధ మూసినకళ్ళు మూసినట్లే వుంచింది. కోర్కెల్ని చంపుకొన్న ఏ ముసలి పతి వ్రతల్ని స్మరించుకుంటోందో! ఏ ప్రణయశక్తుల్ని రేపు కుంటోందో మరి! ఆమౌనానికి అర్థమేమిటో అనూరాధే

చెప్పుకోవాలి. ఆఖరుకి తన్ను, పెనుబాముల్లే వక్షం ప్రకట్గా చుట్టుకొన్న ఆచేతి జోలికన్నా పోలేదు.

మనోబలం తక్కువయినా, ఆ ఉద్రేకంలోని బలంతోనే, మొండిధైరంతో, అభిమానాన్ని విడిచిపెట్టిన — ఏమో — హృదయంతో, అనూరాధను మరీ దగ్గరకు తీసుకున్నాను. కాని, ఆ అర్థంకాని మౌనం నన్ను మరీ రెచ్చగొట్టింది. అనూ రాధ మీద ఓవిధమైన కోపం కలిగింది. ఎన్ని సార్లక నా చెక్కిళ్ళని, వేడితో మండిపోతోన్న ఆ నుదుటిని, వొొప్పజెప్పి వూరుకుందేగాని, అతీపతీ లేదు. అనూరాధ యీ నిష్కామ కర్మ చెయ్యడం నాకు కోపాన్ని కలిగించటమే కాకుండా, లోపల్లోపల గాయంచేసింది. చెయ్యకూడని మహాపరాధం ఏదో చేస్తున్నట్టుగా వొణికిపోయాను.

నామీద అధికారాన్ని చలాయించే నా అనూరాధకు, యీ మెకూ ఎంత తేడా వున్నదీ? ఈ అనూరాధలో వికాసం లేదు. ఆ చలాకీలో శకలమైనా కనపడదు. ఆ కళ్ళల్లో జ్యోతులు ఆరిపోయాయి. ఈ అర్థంలేని శూన్య దృక్కులు ఎన్నడూ ఆ కళ్ళలో నివసించలేదు. ఇష్టం లేకపోతే వొద్దన్నా యింత బాధ పడేవాణ్ణికాదు. భరించలేని ఆ మౌనం మాత్రం నాకు ఎప్పటికీ అర్థం గానంతగా బాధించింది.

నాకేనా ఈ మౌనం, ఆ రావుకుకూడానా? లేకపోతే దయచాలనా! ఎందుకు చాలకాని దయ? ఆ రాజారావు రోజూ సంసారం చేస్తుంది యీ మెత్తటి రబ్బరుబొమ్మతోనా? కాక నాతోనేనా యీ మౌనం? ఆట్లాంటి ప్రవర్తనకుగానీ, మందలింపుకుగానీ, నేనేమీ తప్పు చెయ్యలేదే?

ఒకానొకప్పుడు నాకు దగ్గర దగ్గరగా వచ్చిన అనూరాధ, నేనివ్వని ఆ ఒక్క సుఖాన్నీ యిస్తున్నాడనేగా అతనికి దగ్గరయి నాకు దూరమయింది?

హృదయాలకు, ఆత్మలకు, చాతగాని బాంధవ్యం స్త్రీ పురుషులమధ్య కలిగించే శక్తిలోనేవుంటే, ఆ రాజారావిచ్చిన పాటి సుఖాల్ని నావద్దనుంచి తీసుకుంటానికి యిష్టం లేకనంటే నేను వొప్పుకోను. ధైర్యంమాత్రం లేకపోవచ్చు. ఇష్టమే లేకపోతే, తన మంచంచుట్టూ మంత్రించి, దేవదూతల్నో నాగుబాముల్నో, సృష్టించుకొనే శక్తి ఆవిడ పాతివ్రత్యానికి లేకపోతేగా—కుక్కన పేను మాదిరిగా, అట్లా మౌనంగా, పడివుంటానికి.

"శశీ!" అనూరాధ శిలుక్కలాల్చి గుండీలమీదపడ్డ నాచేతిని తీస్తూ, ఒక్కసారి జాలిగా, బాధగా, ప్రేమతో కళ్ళల్లోకి చూసి నావుద్దేశాన్ని గ్రహించినట్టుగా, నెమ్మదిగా, వొదిగింది.

పదిఏనుగుల బలంతో, నా నగ్నదేవతను, మరీ హృదయానికి దగ్గరగా హత్తుకున్నాను. ఆరని కోర్కెలతో, చూచిన చోటనే పదిసార్లు చూస్తూ, తన నగ్నసౌందర్యాన్ని ఆనందిస్తూన్న కళ్ళల్లోకి చూచింది అనురాధ. 'బాగున్నానా' అన్నట్టు ఒక్కసారి కిలకిలా నవ్వింది.

అంతలో యింత మార్పు జరగడానికి కారణమేమిటో! అనూరాధైనా వూహించుకుంటే ఆశ్చర్యపడే విషయమే. రెండు చెంపలమీదా తన రెండు చేతులూవుంచి, నాముఖాన్ని తనదగ్గరకు చేర్చుకొని, మెల్లగా, మెత్తగా రెండుకళ్ళమధ్యా

ముద్దుపెట్టుకుంది. ఒక్క-సారి తనలో ఐక్యం చేసుకోవాల న్నంత గట్టిగా, కావిలించుకుంది.

"శశీ! నాకీ ప్రపంచంలో నీవొక్క-డివే కావాలి. నా ప్రణయమూర్తివి."

"అనూ! అసలునాకు ప్రపంచమే లేదు. కనపడుతుందల్లా నువ్వే!"

ఆమె కిలకిలా నవ్వింది. తనచేత్తో గోముగా, నా చెంపను నిమిరింది. ఆ కళ్ళల్లో వెలుగుతున్న ప్రేమజ్యోతుల మధ్య, విషాదచ్ఛాయలు అప్పుడప్పుడూ పొడసూపు తున్నాయి. ఇదా అనూరాధ మోసానికి కారణం. ఈ ధర్మపన్నాగాలు, కొంగసంఘం, దొంగ భర్తలూ, ఎంతగా బాధించారు నా అనూరాధను? ప్రేమ లేనిఎడారిలో కృత్రిమపు ప్రేమను ఎంతగా కల్పించుకుంది! తానేదో సుఖపడుతున్నానని నమ్మించి, నన్ను వుడికించటానికా యింతగా చెప్పింది ఆ భర్తనుగురించి!

*

అసలు రాజారా వున్నాడా? నాకు ఎందుకో అనుమానం వేసింది. లేడేమో! నన్ను వూరించి వేధించటానికే ఇలా చెప్పిందా? అయితే నా ఆలోచనలూ, విరహాలూ, కోపాలూ ఉత్త పైత్యమేనా? ప్రేయసీకవిత్వం చదవటం వల్లా చలం, నరాల తీపు రచనలను చదవటం వల్లా వచ్చిన చిత్త చాంచల్యమా?

వెంటనే లేచి లోపలకు వెళ్ళాను. నా అనూరాధను దగ్గరకు తీసుకొని హృదయానికి హత్తుకున్నాను.

"ఓసి నా పిచ్చిముండా?" అని మళ్ళీ నవ్వింది అనూరాధ.

# "నాకవసరం"

రెండు గంటల సేపునుంచీ మోహన్ ఏకధారగా మాట్లాడుతున్నాడు. డిన్నరుకొచ్చిన స్నేహితులంతా డిన్నరు సంగతి మరిచి పోయారు. పిలిచిన శాస్త్రిగూడా తీరిగ్గా కూచుని వింటున్నాడు. మోహన్ కాసేపు ఇబ్సన్ సంగతి మాట్లాడాడు. డాంటీ "డివైన్ కామిడీ" లో యేం వుందో యేకరువు పెట్టాడు. "ఆల్ బ్రైట్" చిన్న కథ లక్షణాలు యివి యివి అని చెప్పాడన్నాడు. శరీరమంతా చెమటలు పోసినయి. చెమటలు తుడుచుకుంటూ వాళ్ళ తాత, కవిత్వాన్ని గురించి ఏంచెప్పేవాడో చెప్పాడు. "రోమేరోలా" "మాలియర్"ల నించి 'వెంకటచ...' ఏదో దొంగిలించాడని దొంగతనాన్ని అంటగట్టాడు. అతను ఎన్ని దొంగతనాల్నీ, రంకుతనాల్నీ అంటగట్టినా చుట్టూ మూగినవాళ్లు సహించి పైగా సంతోషించారు. దాని కారణం మోహన్ లోని ఆకర్షణశక్తే. ఆ శక్తి చాలా తంటాలుపడి, ఎన్నో రిహార్సల్సు చేసి సంపాయించుకున్నాడు. ఆ శక్తి కేవలం అతని సృష్టి. అందుకు తన్ను తానెంతో మురుసుకున్నాడు. కొన్ని సంవత్సరాల కిందట అతను ఏమీ కాదు. యిప్పుడో... పెద్ద పత్రికలవాళ్లుగూడా అతని కవిత్వాన్ని ప్రకటిస్తున్నారు. అన్నిటికంటె గొప్ప సంగతి అత నిప్పుడు విమర్శకుడు.

ఎవరో లోపలినించి భోజనాల సంగతి గుర్తుచేశారు శాస్త్రికి. ఆ! అన్నట్టు యీ పెద్దలంతా వచ్చింది డిన్నరుకు. అవును. వీరంతా భోంచెయ్యాలి— ఆ చప్పబడ్డ 'డిన్నరు'ను.

శాస్త్రి హడావుడిగా లేచాడు. అందరినీ లేపాడు.

ముందు మోహన్ లేచాడు. ఠీవిగా, అదో రకంగా చిరునవ్వులు ప్రసరిస్తూ నడిచాడు లోపలికి. రెండు గంటలనించీ అతను మాట్లాడిన సంభాషణ అతనికే ఆనందాన్నీ, హాయినీ ఇచ్చింది. ఎంత బాగా మాట్లాడాడు! విన్న వారు ఎంతగా ముగ్ధులైపోయారు! జీనియస్‌కు తగిన విధంగానే మాట్లాడాడు కాని ఏమీ తీసిపోలేదు. తనకు తాను తృప్తిపడుతూ తనలో తానే గర్వపడ్డాడు.

కొంతమంది భోజనాలకు కూర్చున్నారు. మోహన్ కూర్చోబోతున్నాడు— కూచున్నాడు కూడాను.

"చూడండి... మీ చెప్పులు..."

వెనక్కు తిరిగి చూశాడు. ఎవరు? మాధవరావు, ఎవరో కాదు.

"ఆ! అవును. నా చెప్పులు... కొత్తవి," అన్నాడు.

"అందుకనే..." మాధవరావు గొణిగాడు.

గొణగడం మాధవరావు స్వభావం. అంతేకాదు. భార్యాలాగా, మోహన్ ప్రతి విషయాన్నీ పట్టించుకోవడం కూడా అతనిస్వభావమే. మాధవరావు చెప్పదలించిందేమిటో మోహన్ కు అర్థంకాలేదు. అట్లా అర్థం కాకుండా గాలిలో ఎగిరిపోయిన మాధవరావు గొణుగుళ్ళు చాలావున్నాయి. మోహన్ వాటి కెప్పుడూ ఆరా తియ్యలేదు. కాని ఈసారి ఎట్లా వూరుకోగలడు? ఏదో తన చెప్పుల సంగతి మాట్లాడబోతున్నాడు. నిన్నగాక మొన్న కొన్నవి. అందులో అట్లాటి రకం ఆ పట్టణంలో ఆ జత ఒకట్టే. తిరిగి కావాలన్నా

దొరకవు. కొన్న ఈ మూడురోజులనించీ ఎంతో జాగ్రత్తగా, భద్రంగా కాపాడుకుంటున్నాడు. తను చదువుకొనే రోజుల్లో "ల..." వ్రాసినకుంటి అక్షరాల ప్రేమలేఖనుకూడా అతను అంతగా దాచుకోలేదు. అంతగా మురిసిపోలేదు. "ల..." లేఖకంటే తన హృదయానికి దగ్గరలోవున్న తన కొత్త చెప్పుల సంగతి ఏదో ప్రస్తావించబోతున్నాడు మాధవరావు.

"ఆ! ఏమిటి? 'అందుకనే'......," గుచ్చి అడిగాడు మోహన్.

"ఏమీ లేదులెండి. ఫరవాలేదు."

మాధవరావు మాటలు మోహన్ గుండెల్లో కదుల్లాడాయి. తన చెప్పుల కేదో కష్టకాలం దాపురించిందనుకున్నాడు. పీటచెక్కమీద కూచున్నవాడు కూచోలేకపోయాడు. అటూ యిటూ ఒకసారి చూచాడు, దబ్బున లేచాడు. తను ఆర్టిస్టునన్న సంగతి మరచిపోయాడు. అతనిలోని కవి ఆకాశేఫ్రూ ఏదో మూల దాగాడు. విమర్శకుడు గాలిలో ఎగిరిపోయాడు. అతనిప్పుడు వుత్త మోహన్.

ఉత్త మోహన్ ఎందుకూ పనికిరానివాడూ, అనుమానం మనిషీ, కుళ్ళుబోతూ— చవటకూడాను.

గబగబా ఒకటిరెండు విస్తర్లు తొక్కుకుంటూ పోయాడు బైటకు. తన కొత్తచెప్పులు వాటి స్థానంలో లేవు. ఎక్కడికో గాలి పీల్చుకు రావటానికి వెళ్ళినయి. మోహానుకు గుండె ఆగిపోయినట్లయింది. రొమ్ములమీద చెయ్యి వేసుకు చూసుకున్నాడు. రెండో చేత్తో నాడి పట్టుకు పరీక్షించుకున్నాడు.

నాడి కదుల్తూనే వుంది. చెప్పులుమాత్రం కనుపించడం లేదు; అటూ ఇటూ తచ్చొర్లాడాడు. ఇంకా బైటికి పోయాడు... ఇంకా పోయాడు.

ఎవరో మనిషి తన పక్కగా దూసుకు పోతున్నాడు. మోహన్ దృష్టి ముందు ఆ నూతనవ్యక్తి పాదాలవైపుకు పోయింది. ఏవో చెప్పులున్నాయి. ఏవో యేం? ... తనవే! క్షణంలో గుర్తు పట్టాడు. ఆ కొత్తమనిషి మాత్రం దొంగలాగా కనుపించడంలేదు. ధైర్యంగా నిలబడి మొహంలోకి చూస్తూన్నాడు.

మాట్లాడించడానికి ధైర్యం కొద్దిగా తక్కువైంది మోహన్‌కు. కాసేపు ఆగాడు.

"మీరు పొరపాటున నా చెప్పులు తొడుక్కు పోతున్నారు," అన్నాడు వుండి వుండి.

"మంచిపాటునే తొడుక్కుపోతున్నాను, పొరపాటున కాదు," అన్నాడు ఆ మనిషి. ఐతే ఆమనిషి తనచెప్పులు తెలిసుండే వేసుకపోతున్నాడా! మోహన్‌కు కొద్దిగా కోపం వచ్చింది. ఒక్కఅడుగు ముందుకు వేశాడు.

"ఎట్లా తొడుక్కుపోతావు?" మర్యాదగా మాట్లాడాలన్న సంగతి మరిచిపోయాడు మోహన్.

"బాగానే తొడుక్కుపోతాను. చూడరాదూ?"-చెప్పులు సంగ్రహించిన మనిషి ముందుకు సాగాడు. నాలుగడుగులు వేసి ఆగి, "నాకేం చాతగాదనుకున్నావా? ఇట్లాంటివి నేనూ చాలా తొడిగాను," అన్నాడు.

మోహన్‌లో శృంగారరసం తప్ప అన్నిరసాలు పని

చేశాయి కాసేపు.

"చెప్పులు అక్కడ పెట్టి కదులు"—నిలవేశాడు.

మోహన్ కళ్ళల్లోకి ఒక్క నిమిషం చూశాడు ఆ మనిషి.

"ఇవ్వటానికి వీల్లేదు. ఇవి నాకు కావాలి," అన్నాడు.

మోహన్‌కు చాలా ఆశ్చర్యంవేసింది. ఇత నెవరో కొత్త రకం దొంగలాగా కనుపించాడు. అతనితో ఏం మాట్లాడాలో తోచక జుట్టులో చెయ్యి దూర్చుకున్నాడు. చాలిన బలమూ లేదు. ఏం చెయ్యడం? అతను మళ్లీ ఏదో అందుకున్నాడు.

"ఏమిటి మహా ఆలోచిస్తున్నారు? ఇవి నాకు కావాలి. మీకు కావాల్సొంటే తిరిగి కొనుక్కోండి. నా దగ్గర డబ్బు లేదు. దీని కీ పెద్ద నాటక మేమిటి?"

చెప్పులు కాజేసిందిగాక నాటక మంటున్నాడు. ఎవరు నాటకమాడుతున్నదీ తెలుస్తూనే వుంది. కాని ఈ మనిషిలో ఏదో కొత్తదనం, నేర్చుకోతగింది ఏదో కనపడింది.

"అయితే యిక యిట్లాంటి దొంగతనాలు చలామణీ కావాలన్నమాట."

"అబ్బే! కాదు. మంచి మంచి భవనాలూ, కార్లూ, మంచి మంచి భార్యలూ సంపాయించుకొని అవసరం లేకపోయినా పూరవేసుకొంటూ, యితరులను పులికిస్తూ, యితరుల అవసరాలను మాన్పుతూ కూచోవాలి," అన్నాడు కొత్తమనిషి.

మోహన్‌కు చెప్పులమీద వుత్సాహం తగ్గుతూ వచ్చింది. అత నెవరో బాగా చదువుకున్నవాడు. తనకంటే మేధావిగా కనబడుతున్నాడు. అతని మాటలు యింకా వినబుద్ధి పుడుతూ

వుంది.

క్లుప్తంగా అత నిదివరకు చేసిన యిట్లాంటి ఘన కార్యాల జాబితా అంతా ఒప్పజెప్పాడు. తన కెప్పు డేది అవసర మయినా అట్లాగే చేస్తానన్నాడు. అది భరించవలసిన విధి తన్నా స్థితికి తెచ్చిన సంఘానికే వుంది అన్నాడు. ఏ మేమిటో చెప్పి, మరో కొత్త ప్రపంచంలోకి తీసుకువెళ్ళినట్లే వెళ్ళి మధ్యలో ఎప్పుడో జారుకున్నాడు.

మోహన్ నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. కాసేపటికి తెప్పరిల్లుకుని కళ్లు తెరిచాడు. ఆతను ఎక్కడా లేడు. ఆ సాయంత్రం వరకూ తన్ను ఎంతగానో మురిపించిన తన మంచి కొత్త చెప్పులు తన కిప్పుడు లేవు. అతనికి శరీర మంతా కంపరం పుట్టింది.

రెండడుగులు ముందుకి వేశాడు. శాస్త్రి ఇంట్లోనించి మాధవరావూ, శాస్త్రీ వస్తున్నారు తనకొరకే. ఎట్లా వెళ్ళడం, చెప్పులు లేని తను? ఇంటిదారి పట్టాడు. మాధవరావు వెనకాల గొణుగుతున్నాడు. వినిపించుకోకుండా సరాసరి యింటికి నడిచాడు.

తన కొత్త భార్య తనకొరకు ఎదురు చూస్తూవుంది. దిక్కులు కాస్తూవుంది.

"డిన్నరు బాగా వుందా?" అని అడిగింది.

"ఆఁ! బాగా వుంది"—మోహన్ శరీరం, హృదయం, ఆత్మ అన్నీకూడా తప్త కాంచనం మాదిరిగా తుకతుక మంటున్నాయి కాసేపు బిక్కమొహం వేసుకూర్చున్నాడు.

"కొత్త చెప్పులు పోయినవి." నెమ్మదిగా గొణిగాడు.

"మీా శాస్త్రి ఎవర్నో విశ్వసోదరుణ్ణి పిలిచాడు డిన్నరుకి."
పెద్దగా నవ్వేసింది మోహన్ భార్య.

మోహన్ ఆ మాటలు వినుపించుకొనీ, వినుపించుకో లేదు. తన "స్టడీ" రూముకు పోయి కుర్చీలో కూలబడ్డాడు.

అక్కడ అతని భార్య, పడక గదిలో చాలాసేపు ఆవలించి దీపం ఆరిపేసి పండుకుంది.

# ఒకటే నాటిక

విశాలమైన గది. సాయంత్రం ఐదుగంటలవుతూంది. సముద్రాన్నుంచీ వచ్చే చల్లటిగాలి తెరిచివున్న కిటికీలనుంచీ "ఝుంయి"న కొడుతోంది గదిలోపలకు. గది మధ్యలో గుండ్రపాటి టేబిల్ ఒకటి, దాని చుట్టూ కుర్చీలు వేసివున్నాయి. రెపరెప కొట్టేగాలికి టేబుల్ మీద యిస్త్రీ చేసిన తెల్లటిగుడ్డ అప్పుడప్పుడు లేచిపోతోంది.

ప్రక్కగదిలోనుంచీ మాటలు, నవ్వులూ వినబడుతున్నాయి. ఐదు నిమిషాలకాలం గడిచింది. ప్రక్కగదిలోనుంచి ముందుచెప్పిన గదిలోకి మధ్యవున్న తలుపు తెరచుకొని ఒక్కరొక్కరే వస్తున్నారు. ముందు వచ్చింది మిస్ మార్గరెట్- చామనచాయగా, ఓమోస్తరులావుగా, 22 లేక 23 యేండ్ల ప్రాయంలో వుంటుంది. బాగా చదివింది. ఇంకా చదువుతూంది. సంఘంలో చోరబడక పోయి నంతకాలమూ భయంగా, మాటుగా తలుపు చాటుచేసుకొనే సమాధాన మిచ్చేది అవసరమైనవాళ్ళకు. సంఘములో తెరగ నేర్చిందగ్గరనుంచీ పాత్రతా పాత్రలు తెలీకుండానే. అవసరమైన వాళ్ళతోనూ, అనవసరమైన వాళ్ళతోనూ గూడా స్నేహం చెయ్యడం మొదలుపెట్టింది, ఉత్త ఉత్తమురాలు. అంటే త్వరగా బోల్తాకొట్టచ్చు మనిషిని. నిత్యనూతన జీవితాన్ని ఆకాంక్షించే భావజీవి. మనిషిలో ఓ విధమైన "నావల్టీ" వుంది మార్గరెట్ ముందుగావచ్చి వెనకవాళ్ళకు కుర్చీలు చూపిస్తూంది. ఆ వాయిల్ సిల్కుచీర ఆ మడాలు ఎత్తుబూట్లు, ఖద్దరు పట్టురంగులాంటి ఆ గోధుమరంగు సన్నపట్టు జాకెట్టు ఎత్తయిన వక్షాన్ని అంటిపెట్టుకొని జాకెట్టులోనుంచీ దృశపర్వంగా కనపడే ఆ అందమైన గ్లాసోక్కబాడీ ఒక విధమైనవింత అందాన్ని కలిగిస్తున్నాయి మార్గరెట్ సహజ సౌందర్యానికి.

మార్గరెట్ తరువాతవచ్చిన ఆమె మిసెస్ లీలావతీదేవి. ముప్పయి సంవత్సరాలు నిండినయి. భర్త ఆర్ట్సు కాలేజీలో ప్రొఫెసరు. స్కూలు

ఫైనలు చదివి ఆపింది. ఈమెలో సహజ సౌందర్యంకంటె తెచ్చిపెట్టుకొన్న హంగామా ఎక్కువ, అయినా అందగత్తే.

ఆ వెనకవే మిస్టర్ పాలెస్, మార్గరెట్ తండ్రి వచ్చాడు. యాభై సంవత్సరాలు పైబడ్డయి. కళ్ళఅద్దాలలోనుంచి "ఏమిటోలే పిచ్చిలోకం" అన్నట్టుగా మానవలోకాన్ని అవలోకిస్తుంటాడు.

ఆఖరుకు వచ్చాడు సుదర్శన్, ఆర్టిస్టు, కవిత్వముగూడా చెపుతాడు. అన్నిటికంటె ఎక్కువగా, మానవ జీవితాన్ని అర్థంచేసుకున్నవాడుగా కనిపిస్తాడు. లీలావతీదేవి వయస్సు వుంటుంది. నల్లగా, అందంగా వుంటాడు. "Guest of the day" యీయనే. మిస్ మార్గరెట్ స్నేహితుడు. అతను పదిరోజులనాడు మొదలుపెట్టిన మార్గరెట్ బొమ్మ గీయటం ఆ రోజు ప్రొద్దుటితోనే పూర్తిఅయింది. ఆ సందర్భంలోనే మార్గరెట్, ఆర్టిస్టు సుదర్శనకు "టీ" యేర్పాటు చేసింది.

"టీ"కి పిలిచినవాళ్ళలో రానందుకు క్షమాపణలు పంపిన ఒకరిద్దరు పోగా రావలసింది "సాహిత్యం" పత్రికా సంపాదకుడు ఒకడే. ఈయన పాలెస్‌కు స్నేహితుడు. ఇద్దరికి లావాదేవీలు చాలా వున్నయి. తండ్రి మూలాన్నే మార్గరెటుకు యీయనతో పరిచయం ఏర్పడింది. పరిచయంకలిగి నప్పటినుంచీ మార్గరెటును తన పత్రికకు ఏదో ఒకటి రాసివ్వమని అడుగుతూనే వున్నాడు. నాకు చాతగాదని కూడా చెప్పింది. పరవాలేదు లెమ్మంటాడు. అసలు రహస్యం స్త్రీలుకూడా తన పత్రిక్కు వ్యాసాలు రాస్తున్నారని అనిపించుకోవాలని అయనకు బాగా కుతూహలం కాని కాలేజీ విద్యార్థినులు సైతం పత్రికలకు వ్యాసాలురాస్తే అపవిత్రమై పోతామనుకుంటున్న రోజులివి. అదీగాక ఖర్మంగాలి తన పత్రిక్కు Contribute చేసే ఏ స్త్రీ అయినా ఫలానీ అని సంఘం దృష్టిలోపడ్డా తనకు నామర్దా తెచ్చే ఎండిపోయిన వృద్ధగృహిణికాకుండా వయస్సులోవున్న మంచి అందమైన నాగరికురాలై వుండాలని అతని వుబలాటం

కాఫీహోటలునుంచీ తెచ్చిన పదార్థాలు సర్వరుమణి, పాలస్ యింట్లో పనివాడు టేబుల్ మీద సర్దుతున్నారు. అంతా కుర్చీలు తీసుకొన్నారు.

మిస్ మార్గరెటు: ఎండలు బాగా ముదురుతున్నాయి.

సుదర్శన్: (ఎండకూ, వడకూ చెమటబోసిన సూటుకింది శరీరాన్ని వూదుకుంటూ) అవును. తప్పకుండా ముదురుతాయి. ఇప్పుడు ఐదింటికిగూడా ఎండవేడిమి తగ్గటం లేదు. రేపటినుంచీ ఏడుగంటలకుకూడా తగ్గదు.

మిస్ మార్గరెటు: ప్రొద్దుకూకటము ఆరున్నరకే.

సుదర్శన్: అవును. ఎండాకాలం రాత్రిగూడా ఎండే కాస్తుంది.

మిసెస్ లీలావతి: రేయెండకాబోలు. (అంతా నవ్వారు)

పాలస్: రేయెండ అని ఎప్పుడంటారు?

మార్గరెటు: అదుగో సంపాదకుడు వస్తున్నాడు ఆయన చెప్పాలి.

[సంపాదకుడు లోపలకు వచ్చాడు. అతన్ని చూడగానే సుదర్శన్ ఒక్కసారి భుజాలు ఎగరవేశాడు. వస్తూనే సంపాదకుడు సుదర్శన్ వంక ఒక్కసారి చూశాడు. లావుగా నల్లగా, నిగనిగలాడుతుంటాడు సంపాదకుడు. పొట్టిస్వరూపం. ఏనుగకళ్లు, అయితే బట్టతల లేని అందాన్ని కల్పించింది అతనిలో.]

మిసెస్ లీలావతీదేవి: (సంపాదకుణ్ణి చూస్తూ) రేయెండ అని యెప్పుడు అంటారో చెప్పండి.

సంపాదకుడు: భావకవిత్వం చెప్పేటప్పుడు (పెద్దగా నవ్వాడు)

పాలస్: భావ కవిత్వానికి, ముసలి కవిత్వానికి భేదం

ఏమిటి?

సంపాదకుడు: భావకవులు చెప్పేది చెప్పనా లేక నన్ను చెప్పమంటారా?

మార్గరెటు: రెండూ చెప్పండి.

లీలావతి: వాళ్లు ఏమి చెప్తారో ముందు చెప్పండి.

సంపాదకుడు: భావ కవిత్వమంటే ఆదర్శక కవిత్వం. అందులో అనంత మధుకీలలు, ప్రపంచ ప్రసవవేదనా వుంటాయి. అది అవ్యక్త మధుర వీణాగానము, అలిమండలీకల గానము, ఆలాపిస్తుంది. శ్రుతి లేని శుష్కప్రలాపాలు కాకుండా, లగించిన శ్రుతితో మూర్ఛనలు పోతుంది, అది జీవిస్తుంది. ఎండుటెడదలకు జీవం పోస్తుంది. దానికి హృదయముంది. ప్రేయసీ ప్రియుల వియోగానికి అనంత ఘోష పెడుతుంది. సంయోగానికి మధుర వేణూగాన మాలాపిస్తుంది. వాలు చూపుల్లో, పూలసెజ్జలో, కోకమడతలలో నివసిస్తుంది. ప్రేయసి తొడిగిన పట్టురవికపై ప్రసరిస్తుంది. ప్రకృతిన ప్రేయసి లేకపోతే రేయెండ, ఉంటే పండగ.

మార్గరెటు: మహానుభావా! చాలుగాని మీరు చెప్పండి భావకవిత్వమంటే ఏమిటో.

లీలావతి: భావకవిత్వమంటే మీకు కుళ్లుబోతుతనం.

సంపాదకుడు: భావ కవిత్వమంటే ఏమీ లేని కవిత్వం. భావశూన్యం. పదజాలం మొదట్లోనే పంపుకుంటుంది. నడక చూద్దామా కుంటుపడ్డ నడక. ఛందస్సు పురిటిలోనే సంధిగొడుతుంది. అంటే కవిత్వం లేని కవిత్వమన్నమాట! భావ తెలియని కుకవులకు ఆశ్రయం. లేతకవులకు గమ్య

స్థానం. అనర్గళ కవితాధారగల వాళ్ళను చూచి ఆక్రోశించే పిల్లవెధవలకు యిదొక ఆయుధం.

[అంతా నవ్వారు అరిష్టుతప్ప. సుదర్శన్ గూడా సంపాదకుణ్ణి ముక్కు పట్టుకునేవాడే భావకవిత్వాన్ని తూలనాడినందుకు. కాని అతను వేరేపనిలో నిమగ్నుడై వున్నాడు. సర్వారుమణి అతను సంభాషణలోకి దిగారు. మిగతా వాళ్లు ఆ సంభాషణ వింటున్నారేమోనని చెప్పకుండా జాగ్రత్తపడుతున్నాడు సుదర్శన్.]

మార్గరెటు: అయితే మీ "సాహిత్యం"లో భావకవిత్వానికి చెలామణీ లేదన్నమాట. నేనింకా భావకవిత్వము పంపుదామనుకుంటున్నా (Sarcasm తో అన్నది.)

సంపాదకుడు: అన్నీ పంపుతారు. (లీలావతివంక చూస్తో) చూడండి చక్కని గ్రాంథిక భాషలో వ్యావహారికము కృతకమని సోదాహరణంగా నిరూపిస్తూ గిడుగువారి సూక్తులమీద పిడుగులాంటి ఓ చిన్న వ్యాసాన్ని మా "సాహిత్యం" పత్రిక్కు పంపిస్తారూ ?

మార్గరెటు: అవునవును. మీ ఆదర్శాలకు సరిపోయే వ్యాసం ఆమె రాసివ్వగలదు.

లీలావతి: గిడుగువారంటే ఎవరు ?

సంపాదకుడు: సరేసరి, మీరు రామమూర్తి పంతులు గారినే ఎరగరూ ? వారా ? వ్యావహారిక భాషాలోకానికి అవతార పురుషుడు. ఆ లోకానికి ఆయనే ఆదర్శం, లేచిపోయిన గృహిణికి రంకుమగడే సర్వస్వమైనట్టుగా.

[సర్వారుమణి తట్టలోవున్న బూందీపొట్లం వూడదీసి అందరికీ ప్లేటుల్లో పెడుతున్నాడు. అప్పటికే ఒకొకళ్ళ ముందు రెండేసి ప్లేట్లు—ఇది మూడోది—ఒకో మంచినీళ్ళగ్లాసు పెట్టివున్నాయి.

పాలస్ యింట్లో పనివాడు కాఫీకప్పులూ సాసర్లూ అప్పుడే కడుక్కొని వచ్చాడు టేబుల్ మీద పెట్టడానికి. సర్వరుమణి బూందీప్లేట్లు పెడుతూ సుదర్శన్ చెవిలో ఏదో వూదిపోయాడు.]

సంపాదకుడు: (తినే తినే స్వీటు వొదిలి బూందీప్లేటు ముందుకి లాక్కుంటూ లీలావతితో) ఇంతకీ వ్రాసిస్తారా? రేపు వచ్చే సంచికలో ప్రకటిస్తా.

లీలావతి: నాకు వ్యాసాలు రాయటం అలవాటు లేదండీ అసలు. నా జీవితంలో ఒక్కసారిమాత్రం, వేణు (ఆమెభర్త) బలవంతంమీద "శిశుపోషణ" అనే శీర్షికతో ఒక వ్యాసం రాసి "బాలమిత్ర"కు పంపించాను......

సుదర్శన్: అవును. యిప్పటి బాలమిత్ర ఎక్కువగా "శిశు సంరక్షణ" "ఉమ్మపాలు శ్రేష్టం" ల్లాంటి వ్యాసాలనే ప్రకటిస్తూంది.

మార్గరెటు: ఇంతకీ ఆ వ్యాసం మాటేమిటి?

సుదర్శన్: ఆ వ్యాసం సంగతా ఏమౌతుంది, లీలావతీదేవిగారూ మనం రాయటమేగాని నిజంగా వాటిని అర్థం చేసుకొనే సంస్కారం ఎంతమంది చదువరులకు, సంపాదకులకు వుందో ఆలోచించండి. వేలుముడిచి ఒక్క సంపాదకుణ్ని చూపించండి. (నన్ను మినహాయించ మన్నట్టుగా చూస్తాడు సంపాదకుడు.)

సంపాదకుడు: బాలమిత్ర సంపాదకులకు "శిశుపోషణ"ను అర్థం చేసుకునే హృదయసంస్కారం లేదేమోగాని, సినిమా తారలను అర్థం చేసుకునే సంస్కారము బాగావుంది.

పాలస్: (లీలావతివంక చూస్తూ) శిశుపోషణను గురించి

నిజంగా పిల్లలులేనివాళ్లే వ్రాయాలి.

సుదర్శన్ : "సాహిత్యం" లాంటి పత్రికలే ప్రకటించాలి.

మార్గరెట్ : లీలావతీ యింతకీ వ్యాసం మాటేమిటి ?

లీలావతి : ఆ పత్రికవాళ్లు వేసుకోకపోయేసరికి నాకూ కోపం వచ్చింది. వేణూ దాన్ని తిరిగి వ్రాసి మరో పత్రిక వాళ్ళకు పంపమన్నాడు. అంతే, మళ్ళా దానిజోలికి పోలా.

సుదర్శన్ : బెర్నార్డ్‌షా చెప్పినట్టుగా ప్రపంచంలో చదువుకోని వాళ్ళు యీ పత్రికా సంపాదకులే. పత్రికలలో పడాలంటే యీతగాళ్ళకు చుట్టాలమన్నా అయి పుట్టాలి, "మార్గరెట్ వ్యాల్యూ" వున్న యితర రచయితలమన్నా అయివుండాలి.

మార్గరెట్ : (లీలావతివంక చూస్తూ) వ్యావహారికభాష మీాద తరవాత రాసినా యిప్పటికి మాత్రం ఆ "శిశుపోషణ" వ్యాసాన్ని వారికివ్వు. "సాహిత్యం"లో ప్రకటిస్తారు.

సంపాదకుడు : ఓ నిరభ్యంతరంగా ప్రకటిస్తా. గ్రాంధికంలో మాత్రం వుండాలి.

సుదర్శన్ : వారి "సాహిత్యం" లో "బావుటా బీడీ" వ్యాసమయినా ప్రకటిస్తారు. కాని గ్రాంధికంలో మాత్రం వుండాలి.

[ఇంతలో బైటనుంచీ ఏదో కేక వినబడింది. "పాలెస్ దొరగారి ఇల్లు ఇదేనండీ" అని తిరిగి వినపడింది. మార్గరెట్ లేచి, వాకిట్లోకి వెళ్ళింది. వాకిట్లో ఓ నలభైసంవత్సరాల మొద్దపాటి శరీరం మనిషి చేతిలో ఏదో కవరుపట్టుకోని నిలబడి అటూయిటూ చూచి లోపలకు తొంగిచూస్తున్నాడు ఇంతలో మార్గరెట్ పోయింది.]

కొత్తమనిషి: అమ్మగారూ పాలెస్ (Palace) దొరగారి యిల్లు ఇదేనా?

మార్గరెట్: అవును. పాలస్ (Paulus) దొరగారి ఇల్లు ఇదే. ఏం కావాలి? రా లోపలికి (మార్గరెట్ వెనకే ఆతను కూడా పోయాడు లోపలకు.)

కొత్తమనిషి: (అందర్ని తిరిగ్గా చూసి) అయ్యా "సమదర్శని" దొరగారున్నారా?

పాలస్: ఇక్కడ "సమదర్శని" దొరగారు లేరోయ్. "సాహిత్యం" దొరగారు మాత్రం వున్నారు. (అంతాగొల్లున నవ్వారు.)

కొత్తమనిషి: (ఎందుకు నవ్వుతున్నారో అర్థంగాక) బాబూ! మా డాక్టరుగారు "సమదర్శని"గారికి యీ వుత్తరం పంపించారండీ.

మార్గరెట్: (నవ్వు ఆపుకొంటూ) ఎవరోయ్ సుదర్శన్ దొరగారా?

కొత్తమనిషి: (పళ్లు యికిలిస్తూ) అమ్మా వారే "సమదర్శని" బాబుగారు ఏరీ ఇక్కడ వున్నారా? వారింటికిపోతే ఇక్కడ వుంటారని చెప్పారు. అమ్మగారూ.

సుదర్శన్: ఏదోయ్ కవరు.

కొత్తమనిషి: బాబుగారూ మీరేనా, ఇదుగో, (ఉత్తరం అందిస్తాడు చేతికి.)

[సుదర్శన్ చించినకవరు అంచును కంబళిపురుగును విసిరినట్టుగా, తన చెవిలో ఏదో వూదడానికివచ్చిన మణిమీద విసిరి, తొందరతొందరగా ఉత్తరాన్ని తెరుస్తాడు- చదవక మునుపే అంతా గ్రహించినట్టుగా మూస్తుంటాడు.]

సంపాదకుడు: ఏమిటీ "భావుకా బీడీ" వ్యాసమా! ఎన్నడైనా చూశావు నా పత్రికలో. కాని అట్లాంటి పత్రికలు లేకపోలేదు తెలుగుదేశంలో.

మార్గరెటు: (సంభాషణ మార్చే ఆలోచనతో) సాహిత్య పరిశ్రమ ఏవిధంగా ప్రయోగం? (సంపాదకుణ్ణి చూసింది.)

సుదర్శన్: (అందుకొని) సాహిత్యం రాని సన్నకారుతో సాముగరిడీలు చేసి, కుస్తీలు పట్టడానికి (పెద్దగా నవ్వాడు.)

లీలావతి: సాహిత్యంతో సాముగరిడీలా?

సంపాదకుడు: ఇదేం తాలింఖానా అనుకున్నారా?

సుదర్శన్: (విసుగుతో తన వంక చూస్తున్న డాక్టరు మనిషిని ఒక కంట చూస్తూనే) అనుకోవటంగాదు. మీరు భాషను ఒక తాలింఖానాకింద చేశారు. మీరు "ఫ్యూడల్ రెలిక్సు." మీమీద భావకవులు బూర్జువా విప్లవాన్ని ఏనాడో తీసుకొచ్చారు. ఈనాడు సంఘం, భావకవులను వారి కాంతా కలాపాలనుంచీ, "ఉమర్ ఖయ్యాం"ల కలత నిద్రలనుంచీ మేలుకొలిపి భాషలో "ప్రొలిటేరియన్ విప్లవం కావాలి" అనే నినాదం క్రింద ఆయత్తపడుతుంటే, మీ 'సాహిత్యం' పత్రికలూ, మీరూ, ఏం చేస్తున్నారు? కొన్ని వేల సంవత్సరాలు వెనక్కు దేకాలంటున్నారు. సంఘం ఏమైపోయినా, మానవులేమైనా మీకు పట్టదు. భాషకు ఎన్ని కొమ్ములు వూడినయి, ఎన్ని కొత్తతోకలు పుట్టాయి, అన్న మీ లెక్కల గొడవలో, మానవ హృదయాల రోదన మీకు వినపడుతూందీ?

[డాక్టరు మనిషి నేను వెళ్ళాలి అన్నట్టుగా చూస్తాడు. సర్వరుమణి చెవిదగ్గరకువచ్చి ఏదోవూదిపోతాడు.]

సంపాదకుడు: బాపురే! ఏమిటీ భాషలో "పొలిటేరియన్" విప్లవమా? "బూర్జువా" విప్లవమా? చచ్చాం! భాషామతల్లి చీనాదేశం కాదు. ఈ బాంబుల్ని భరించడానికి.

సుదర్శన్: తాలింఖానా అంతకంటే కాదు. మీ కుస్తీ ప్రదర్శనాలకు. కొద్ది రోజులలోనే భాషలో ప్రొలిటేరియన్ విప్లవంవచ్చి తీరుతుంది. (ఖాళీచేసిన "టీ" కప్పును టేబుల్ మీద పెట్టాడు. అటూ యిటూ చూసి ఒకసారి సర్వరుమణి వంక డాక్టరు మనిషివంక చూశాడు. గాలి రావడం లేదన్నట్టుగా నటిస్తూ గాలికోసరం వాకిటిదాకా పోయాడు. మూడు నిమిషాలకాలం గడిచింది. సర్వరుమణి తందరబిందరగా ప్లేటు సర్దుకోని వాకిట్లోకి పోయాడు. వెనకాలే డాక్టరు మనిషి కూడా పోయాడు. ఒక్క నిమిషం దాటింతరువాత తందరబిందరగా లోపలకుపరుగెత్తుకొచ్చారు యిద్దరూ.

సర్వరుమణి:<br>
డాక్టరు మనిషి: } పోయాడు.

మార్గరెటు: (ఆశ్చర్యంగా) ఎవరు పోయింది!

సర్వరుమణి:<br>
డాక్టరు మనిషి: } అయనే! పారిపోయాడు.

లీలావతి: సుదర్శన్‌గారా? ఎందుకు పారిపోవటం?

సర్వరుమణి: } మా మేనేజరు కివ్వాలిసిన డబ్బు అడిగానని.

డాక్టరు మనిషి : మా డాక్టరుగారి కివ్వాలిసిన డబ్బు అడుగుతానని.

మార్గరెటు : ఏమిటీ వాగుడు. వెధవల్లారా. ఎవరిని గురించో మీరు మాట్లాడేది తెలుసా ?

సర్వరుమణి : సుదర్శన్‌గారే, మా కాఫీహోటల్లో ఆరు రూపాయలపైన బాకీబడి తిప్పుతున్నారు.

డాక్టరు మనిషి 'సమదర్శని'గారే మా డాక్టరుగారికి పదిహేను రూపాయ లియ్యాలట.

మార్గరెటు : నోరుముయ్. వారు బయటకు పోయివుంటారు. ఇప్పుడే వస్తారు.

[మార్గరెటుకు లోపల్లోపల అనుమానంగానేవుంది. ఆ కింపటిరోజు తనదగ్గిర పట్టుకుపోయిన పది రూపాయలుగూడా యీ గంగలో కలిసి నట్లేనా అనుకుంటుంది. కాని అమెరికా అతని అందంమీద తెలివితేటల మీద పోయిన మనస్సును మళ్ళించుకునే శక్తిరాలా. ఆమె ప్రేమను తెంచుకోలేని దౌర్బల్యం ఆమెను ఆవరించింది. డాక్టరు మనిషిమాత్రం గుండెలు బాదుకుంటున్నాడు. మణి లోపల్లోపల తిట్టుకొంటున్నాడు. లీలావతీ సంపాదకులు ఒకళ్ళ మొఖాలు ఒకళ్ళు చూచుకొంటున్నారు.]

పాలెస్ : (లోపలనుంచీ వస్తూ మార్గరెటుతో) అమ్మాయీ లోపల నా కోటుజేబులోని ఐదు రూపాయల కాయితం తీశావా ? (మార్గరెటు అదాటున బిక్క మొహం వేసింది.)

సంపాదకుడు : చచ్చాం ! (టేబుల్‌కింద చెప్పులు వెదుకోవడం మొదలెట్టాడు.) ఈ పొలిటీరియర్ విప్లవం

మా పత్రికా కార్యాలయంవరకూ రాకముందే, పాతప్రతు లన్నీ జాగ్రత్త చేసుకుంటే మేలు.

పెద్దగా నవ్వాడు సంపాదకుడు. శ్రుతికలిపింది, లీలావతీదేవి. సర్వారు మణి నవ్వును కొని తెచ్చుకుంటున్నాడు. డాక్టరు మనిషి మాత్రం యింకా గుండెలు బాదుకుంటూనే వున్నాడు. బజారులో బిచ్చగాడి కేకకు, వాకిట్లో తెల్లకుక్క సమాధానం చెబుతోంది. ఆవతల బజారులో సమ్మె చేసిన ఫ్యాక్టరీకూలీలు జాలిగా, బాధగా, ఉద్రేకపూరితంగా, గేయాలు పాడుతూ పోతున్నారు. చర్చిలో గంటలు మోగాయి. మోగుతున్న గంటలనుంచి "ప్రతి మానవుడు జీవించాలి" అన్న జీవితపరమార్థాన్ని స్ఫురింపజేసే ధ్వని సుదర్శనం వుడాయించిన వాకిలినుండా రింగురింగున తిరుగుతూ గుళ్ళోరాగం మాదిరిగా వచ్చి, అందరి వీనుల్లోనూ ప్రవేశిస్తోంది. కాని సంస్కారంలేని ఆ మట్టిబుర్రలకు అది గోలగా, ధ్వనిగా మాత్రమే అనిపిస్తూంది. "ఈ ప్రపంచంమీద, ఈ డబ్బుమీద అందరు మానవులకు హక్కులేదా అనుభవిస్తానికి" అన్నట్టుగా ఖాళీ మొహంవేసి చూస్తోంది, సుదర్శనం విడిచిపోయిన వుత్తరం అగ్గిపెట్టె.

నా నాటిక ముగిసింది. సంపాదకుడు నవ్విన పెద్దనవ్వే దీనికి స్వస్తివాచకం. సంపాదకునితోపాటు యీపాటికి పాఠకులుకూడా నవ్వుతుంటారు. అది సుదర్శనుణ్ణిచూచి మాత్రం అయితే, అది కేవలం అజ్ఞాన ప్రదర్శనం వారు అజ్ఞాని అయిన సంపాదకునితో సమాన మవుతారు. ఈ నాటిక ముగిసేసరికి నేనూ నవ్వాను. ఎందుకు? ఈ "బూర్జువా" మొరాలిటీకీ, మానవత్వాన్ని చంపి పశుత్వాన్ని ప్రకోపిస్తున్న ఈ బూర్జువా దోపిడీవిధానానికీ. ధనికవాదవిధానం కిందనలిగి, పీల్చి పిప్పిజేయబడుతోన్న జీవచ్ఛవ మానవులు బ్రతకాలంటే దొంగతనాలు, చెయ్యక ఏం చేస్తారు? సర్వమానవులూ సౌభ్రాతృత్వంతో సుఖంగా బ్రతక నేర్చే దినాలు వచ్చేవరకూ, యిటువంటివి జరుగుతూనే వుంటాయి. అంత వనుక నేనూ నాతో పాటు పాఠకులూ కూడా ఈ ధనికవాదాన్ని చూచి నవ్వేదే, అసహ్యించుకొనేదే. ఈ సంపాదకుడిలాంటి మూర్ఖులెవరయినా సుదర్శనుణ్ణి చూచి నవ్వుతామంటే, నా అభ్యంతరం లేదు. వారు అభివృద్ధిని ఆటంకపరిచేవారు అనిమాత్రం అంటాను.

## గోపీచంద్ గారూ,

ఇదీ నా కథల పుస్తకం. ఈ కథ లన్నీ మీరు యిది వరకే చదివి వుంటారు. అయినా ఓపికతో యింకోసారి చదవమని నా కోరిక. నా ఆశయాలు, నా భావాలు అన్నీ మీకు తెలియనివికావు. ప్రస్తుత రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థలమీద ఎట్లాంటి విప్లవం రావాలని వాంఛిస్తానో, సారస్వతంయొక్క ప్రయోజనం ఏమై వుండాలని కోరు కొంటానో, అన్నీ మీకు కొత్తసంగతులు కావు.

అసలు యివి అర్థంలేని మాటలు. నాలో జీర్ణించిపోయిన, యీ అభివృద్ధి దోహదభావాలూ, యీ వైజ్ఞానిక వికాసమూ — ఏ కొద్దిగా అయినా వుంటే — అంతటికీ కారణ భూతులు మీలో వున్న విజ్ఞుడూ, విప్లకారుడున్నూ. అందు వల్ల యీ కథలు ఎట్లావున్నయ్యో చెప్పాలంటే మీరే సమర్థులని నా అభిప్రాయం. మీరు చదివి చెప్పండి. నా ఆశయాలూ, నా భావాలూ యీ కథలద్వారా బాగా ప్రచారం చేసుకోగలిగానో లేదో చెప్పండి. రచనయొక్క ఆదర్శం అదేనని నా అభిప్రాయం—చాలామంది తెలిసినవాళ్ళ అభిప్రాయం కూడాను అనుకుంటాను.

ఈ కథల్ని గురించి మిత్రుడు కుటుంబరావు ఏమంటున్నాడో విన్నారా?

"... ... ...రచనా, శిల్ప నైపుణ్యాలు వెతకవద్దు. రస సిద్ధికోసం కూడా చూడవద్దు. ఇందులో కథకుడి ఆశయం ప్రధానంగా రసభంగమే."

ఈ మాటలు నాకు బాగా నచ్చినయి. భావకవుల సంస్కారాన్నీ, నగిషీలతో చెక్కి పోషించే ప్రస్తుత రచనా శిల్ప నైపుణ్యాన్నీ, నేను ఉసహ్యించుకుంటాను. తద్రస సిద్ధికై నేను పాటుపడని మాటా నిజమే. దానికి పూర్తిగా వ్యతిరేకుణ్ణి కూడానూ !

భావకవులు కొద్దిమందికే వ్రాస్తారు. వారి లెక్క ప్రకారం ప్రజానీకానికి సారస్వతంతో ఏమీ నిమిత్తంలేదు. వారు ఆ కొద్దిమంది రుచులకోరకై రచనకు నగిషీలు చెక్కి, వెనకది ముందూ, ముందుది వెనకా, చెప్పిందే యింకోరకంగా చెబుతూ వ్రాస్తారు. వారి రచనల్లో విస్పష్టంగా కనుపించేది పులు ముడు మాత్రమే. ఎంత పులుముడుతో వ్రాయగలిగితే అంత రచనా నైపుణ్యం అతనిలో వున్నట్టు అని వాళ్ళలెక్క. కొద్దిమందికి వ్రాస్తారు గనకనే వారి రచనలు కొద్దిలోనే చచ్చి, వూరుకున్నాయి.

సాహిత్యంయొక్క ప్రయోజనమల్లా ప్రజాభివృద్ధికి దోహదమిచ్చే భావాలను, ప్రజలందరికీ అర్థమయ్యేటంత సులువుగా చెప్పడమే అని నా ఉద్దేశం. అందుకనే నా రచన, చచ్చిపోయిన భావకవిత్వ తత్వాన్నిగానీ, శిల్పాన్నిగానీ, పోషించదు. ఆ నిర్జీవ, విప్లవ ప్రత్యాఘాతక భావాలపై తిరుగుబాటు తెచ్చే విప్లవభావాల ప్రచారమే, విషయాన్ని కొద్దిమందికే అర్థంచేసే శిల్పాన్ని రద్దు చెయ్యటమే నా రచన ఆదర్శం.

ఈ కథలద్వారా ప్రజల్లో, నా భావాలు, తేలికగా, సూటిగా, నాటుకుంటే రచనానైపుణ్యం—భావకవుల రచనా నైపుణ్యంకాదు—సంపాయించినట్లే. అప్పుడు పూర్వరస భంగమూ నూతన రససిద్ధీ కలుగుతయి. అంటే నాలో యీ శక్తిని సృష్టించిన మీ కృషి ఫలించినట్లే. కాక ఏ కారణం చాతనైనా నా కథలు ప్రజల్లో ప్రబోధాన్ని కలిగించలేక పోతే అది నా అసమర్థతను రుజువు చేస్తుంది.

ఇక యీ కథల్లో చిన్నకథ లక్షణాలు వున్నయ్యా, లేవా అని ఎవరన్నా శల్యపరీక్ష చేసి, ఒక అప్ హేమ్ చెప్పిన లక్షణాలో, స్టీవర్టుబీచ్, ఆల్ బ్రైట్‌లు చెప్పిన లక్షణాలో లేవని విమర్శించినా, వారితో నాకు పేచీ లేదు. కాని అట్లాంటి వారికి మాత్రం ఒక సలహా యిస్తాను.

లక్షణాలు అనేవి—కథకు కానీయండి, నవలకు కానీయండి, దేనికైనా కానీయండి — ఒక ప్రయోజనాన్ని సాధించడానికి వుపయోగించే సాధనాలే గాని వాటి కవే ప్రయోజనాలు కావు. కాగూడదు. రచనాపద్ధతికీ, శిల్ప నైపుణ్యానికీ, స్థిరస్వరూపం ఎక్కడిదీ? కాలాన్నిబట్టి మారుతూ వుంటాయి.

అందువల్ల యీ కథల్లో, చిన్నకథ పాతలక్షణాల గట్లను దాటి కొత్త లక్షణాలు ఏవైనా ఒకటి రెండు కనిపిస్తే అవల్లా చిన్నకథ పరిణామానికి నేను కలుపుతున్న అధ్యాయం అన్న మాట.

మీా రేమంటారు?

కొన్ని సంవత్సరాలనాడు వ్రాసిన ఈ కథలు అచ్చు వెయ్యవలసిన అవసరం యీా నాటికీ వుందని మీారు మనస్ఫూర్తిగా అంటే నా ఆదర్శం నెరవేరినట్లే నని భావిస్తాను.

మీ

సుబ్బారావు

వస్తుంది!

# "రాడికల్"

రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ వారపత్రిక

సంపాదకుడు :

జి. వి. కృష్ణరావు, తెనాలి.